# తపస్సిద్ధి



( మొవ్వ శ్రీనివాస పెరుమాళ్లుగారి జీవిత చరిత్ర )



మొవ్వ వృషాద్రిపతి

# తపస్సిద్ధి

శ్రీ పద్మాల వేంకటేశ్వర్లుగారిది
గ్రంథము

సాహితీవాచస్పతి - ఉపన్యాస చతురానన

మొవ్వ వృషాద్రిపతి

# తపస్సిద్ధి

(శ్రీ శ్రీనివాస పెరుమాళ్ళుగారి జీవిత చరిత్ర)

కృతిస్వీకర్త్రి

మా తల్లిగారు

మొవ్వ బాలమాంబ

కృతికర్త

మొవ్వ వృషాద్రిపతి

తొలిముద్రణము. 1000 ప్రతులు.

ప్రమోదూత - శ్రావణం.
1990 - ఆగస్టు.

వెల రు. 20/-



వలయువారు

మొవ్వ పద్మాలయాదేవి
W/o శ్రీ వృషాద్రిపతి
ప్రభుత్వ డిగ్రీ కళాశాల
రేపల్లె. (గుంటూరు జిల్లా)

మొవ్వ కృష్ణప్రసాద, బి.ఏ.
రామకృష్ణ ధియేటరు వద్ద
అవనిగడ్డ
దివితాలూకా, కృష్ణాజిల్లా (ఆం. ప్ర.)



కీ. శే. బ్రహ్మశ్రీ మొవ్వ శ్రీనివాస పెరుమాళ్ళుగారు
వారి ధర్మపత్ని
శ్రీమతి మొవ్వ బాలమాంబగారు.

# విజ్ఞప్తి

సుధీమతులారా!

మా తండ్రిగారు పూజ్యపాదులు, కీ. శే॥ బ్రహ్మశ్రీ మొవ్వ శ్రీనివాస పెరుమాళ్లు, సద్గురు చంద్రుని, జీవిత చరిత్రము, పద్య కృతిగా రచించితిని. త్వరగా ముద్రించి, ఆవిష్కరణోత్సవము నిర్వహింపవలయునను కుతూహలముతో, విజయవాడ వచ్చుట జరిగినది. వారు తప్పులేకుండా ముద్రింతుమని మాట యిచ్చుటచే, విశ్వసించి మేము ప్రూఫులు చూచుట జరగలేదు. ఫలితము–కోకొల్ల లుగా ముద్రణ దోషములు. 'వే' అను నక్షరమును, 'క్రా'వడి, 'పూర్ణానుస్వారము' మొదలగునవి పుస్తకము మొత్తము మీద మచ్చునకైన అంటినవికావు. తవర్గ ద్వితీయ, చతుర్థాక్షరములు ఒక దానికి మారింకొకటి చోటుచేసుకొనినవి.

'వే' అక్షరములు, క్రావడులు, తప్పొప్పుల పట్టిక యందు చూపలేదు. వానిని కూడ చూపినచో తప్పొప్పుల పట్టిక అసలు గ్రంథమును దిగమ్రింగెడిది. ఈ విషయమున ప్రెస్ వారిని నిందించుట తగదు. చూడకుండ ముద్రింపుమని కోరుటచే నన్ను నేనే నిందించుకొనవలె. నా బాధ్యతను వారిపైకి నెట్టి నెపపెట్టు స్వభావము మంచిది కాదు కదా!

సామాన్యముగా పాఠకులు, తెలిసికొని చదువుకొనగలరని భావించిన దోసంగులను సవరింపనైతిని. కొన్ని ప్రయోగములందు కొంత స్వాతంత్ర్యము వహించితిని. దయతో తప్పొప్పుల పట్టిక చూచి, పద్యములను ముందే సవరించుకొని (శ్రమయని భావింపక) చదువుకొనవలసినదిగా ప్రార్థించుచుంటిని.

ద్వితీయ ముద్రణమున కడుంగడుజాగరూకతతో నిర్దోష విలసితముగా గ్రంథమును మీ ముందుంచగలను.

నమస్కారములతో,

మీ

మొవ్వ వృషాద్రిపతి

# కృతజ్ఞతాంజలి

శ్రీ లక్ష్మీ రమణీమణీ ప్రణయ తుష్టిన్ చంద్ర భాగా సరి
త్కూల ప్రాంత విహారలగ్న హృదయోద్యోగుండు, మాచర్ల వా
సాలంకారుడు చెన్నకేశ్వరు డభీష్టావాప్తి విశ్వప్రజా
పాళిన్ బ్రోవుత సౌమ్య వీక్షణ కళా వ్యాపార ధీపారుడై. 1

ఋణపడియుంటి నిద్దఱకు నిద్ధరనందు నొకండు సాహితీ
వనితకు వల్లభుండు-మృదుభావ పరిమళ కావ్యమల్లి
వనతరు మాధవుండు, పరివర్ధిత సూక్ష్మ విమర్శన క్రియా
వనచరితుండు వేంకటశివయ్య మహోదయు నెంతు నమ్రతన్. 2

లలిత రసాలవాల మృదులస్థిర నిర్ఝరగాంగ భంగ సం
కలిత మహోశు గమునకై తలనల్లి, మనోజ్ఞ చంద్రికా
మల నిజకీర్తి, పుంగుణ సముంచిత భారతి, శ్రీ ప్రసాదరా
ట్కులపతి సద్గురూత్తముని రోచవముఖ్యుని సన్నుతించెదన్. 3

కవియై నిర్మల దేశిక ప్రథితుడై కర్మిష్ఠియై పండిత
ప్రవరుండై నవభక్తి సంకలితుడై పౌరాణిక శ్రేష్ఠుడై
దవళేందు ప్రతిమాన కీర్తి భరితోద్దాముండు మా తండ్రి వై
భవ చారిత్రము నాదరింపు డనుచున్ ప్రార్థింతు
నాంధ్రావళిన్. 4

గురులకు గురువయి. కవితా
వరణీయుం డమిత కీర్తి వర్ధను డాః
పరత రచియించెను నెఱి మ
ద్గురు వరు డాంధ్ర కవిలోక కులపతి పతియై. 5

ఆది నుండియు నేటి మభ్యుదయము
నెంచి ఆశీస్సుధలు కురిపించి, మించి
పంపెను శుభాభినందనల్ భవ్యమూర్తి
కనుమలూరు వేంకట శివాఖ్య ప్రకీర్తి. 6

విని నీరాజన మెత్తె భవ్యకవితావేశుండు, విద్వత్కవీ
శ్వర శశ్వద్బిరుదుండు యార్లగడ్డ వంశస్వామి శ్రీ సుబ్బరా
ద్వర విద్యానిధి; గిద్దలూర్కుల సుధావారాశి జైవాతృకుం
డరుదౌ పండిత మాన్యుడౌ బసవరాజందించె తా ‘సంస్మృతిన్.7

కవి భట్టారక సార్థకాచ్ఛ విశదఖ్యాతుండు, షట్ఛాస్త్ర వా
ర్ధి విలోలాంచిత హంస, దాశరథిసూరి శ్రేష్ఠు డర్పించె, జ్ఞా
న విరాగుండయి, ‘అశ్రుతర్పణము’ కర్నాటీద్య వంశాబ్ధి పూ
ర్ణ విధుండౌ నల వేంకటేశ్వరుడు సంధానించె
‘భాష్పాంజలిన్’. 8

కమరెన్, దుర్దశ జీవితాశ లనుచున్ ‘కన్నీటి వీడ్కో’ లిడెన్
కమలాదేవి వచో విశారద యనంగా, నిట్టి మౌనీంద్రు వృ
త్తము గ్రంథంబుగ వ్రాయుమంచు కడుప్రోత్సాహంబు
కల్పించి రే
యమల ప్రాభవు లట్టివారి కివియే ప్రాంచన్మహోపాకముల్.9

అనయము లక్ష్మీనారా
యణ తద్వృత్తాంతమెల్ల నందింపు మటం
చును ప్రోత్సాహ మొసంగును
ఘనముగ శ్రీ గురుని యందుగల సద్భక్తిన్. 10

హరి విఠలు నామధేయుడు
హరి పాదార్చన రతుండు, లకలంకుడు, నా
కరుదౌ ప్రోత్సాహము నిడి
కరమరుదుగ గారవించె కరుణా పరుడై. 11

అతడు వైద్య శాస్త్రమున నందియ వాసిన చేయి సత్క్రియా
ప్రాతవినీత కీర్తి, యెలవర్తి కులాబ్ధి సుధాకరుండు వి

ఖ్యాతుడు చంద్రమోహన శుభాంచిత సార్థక నామధేయు, అ
ర్థాతుర కల్పశాఖి, గురునందు విధేయుడు వాని మెచ్చెదన్. 12

శ్రద్ధతోడుత ప్రూఫులు చక్కదిద్ది
గ్రంథముద్రణ విషయాన కడుశ్రమించె
నల జనార్ధనస్వామి నిశ్చల మనీష
నాదు తమ్ముండు సుగుణ మాన్యప్రకీర్తి. 13

సమయము తక్కువ యైనను
శ్రమపడి తగు కాలమునకె గ్రంథము కడు నం
దముగా ముద్రణ చేసిరి
తమి మాష్టరు ప్రింటరులు ప్రధన్ బెజవాడన్. 14

శీర్షము వంచి వీరల కశేష వినీతి తదీయ పాదసం
ఘర్షణతో ప్రణామము లఖండముగా నొనరింతు, నూతనా
కర్షక సత్కవిత్వమును క మ సనాతన ధర్మమార్గ సం
కర్షితమున్ పొనర్చు గుణగణ్యులు నార్షపథాత్ములన్
మతిన్. 15

"కవి భట్టారక"

# అశ్రుతర్పణము

మొవ్వ దాశరథిసూరి

నారాయణాక్షి నవ నీరజ మత్త భృంగం
భక్తి ప్రపత్తి సరసీ చర రాజ హంసమ్
పౌరాణిక ప్రథమ ముత్తమ తత్త్వ బోధం
శ్రీ శ్రీనివాస గురుపుంగవ మాశ్రయేఽహమ్. 1

తపః కృత్వా తమో హత్వా
హిత్వా సంసృతి సంగతిమ్
ప్రాప్తోఽసి పదవీం నిత్యాం
త్వాదృశః కోఽస్తి భాగ్యవాన్. 2

అన్నా! నీ విటు దివ్యధామమునకున్ యానంబుఁ గావించుటన్
ఛిన్నాభిన్నము లయ్యె మా మనములిస్సీ! భక్తి పీఠంబునన్
వన్నెల్ మాసెను జిన్నవోయెనదె గోపాలుండు గాంభీర్య సం
పన్నుండౌ భవదీయ వాగ్రసము నాస్వాదింపఁగా లేదిఁకన్. 3

కలుష పథ ప్రవర్తనుల గాసియడంపఁగ నెంచి తండ్రిగా
ర్నిలిపిన భక్తి పీఠమును నేర్పు దలిర్పఁగ నింతదాఁక నే
వెలితియు నొందకుండ నడిపించితి మీ విటు వెళ్ళిపోవుటన్
బలము తొలంగె నేపగిది భాసిలునో గద ముందు ముందటన్. 4

ముప్పదిమూడు వర్షములు ముప్పూర మొక్కటిగాఁ
బురాణముల్
చెప్పితి మెన్నియో, సకలసీమల యందు మహాజనుల్ తలల్
ద్రిప్పి సెబాసటంచు వినుతించుచు నుండఁ గనిష్ఠ సోదరుం
డొప్పుగ నిండ్లయొద్ద సమయోచిత కార్యము దీక్ష సేయఁగన్. 5

ముగ్గుర మొక్క వేదిపయి మోదముతో వసియించి యుండనా
ముగ్గురు మూర్తులున్ శ్రుతులు మూడు, మహాగ్నులు
మూడు నీగతిన్

దగ్గఱ మాకునంచు బహుధా నుతిసేయుచు సభ్యకోటి నే
లొగ్గెడి దట్టి సత్కథల కోపముగా నిఁక నెంతచేసినన్. 6

ఏ నొక పూట నీవు నటులే యొకపూట నభ స్తరంగిణీ
ధ్యానము లీనఁగా నుడువు పట్టున రెండవ యన్నగారు తో
డ్తోన పఠించు చుండఁ దమితో నలరామ కథా ప్రపంచముల్
గానము చేసినారము జగంబు లెగంబడి సన్నుతింపఁగన్. 7

ఈ కరణి నిన్న మొన్నటి
దాఁకన్ మాతోడఁ గలిసి తనరిన నీవీ
లోకంబు విడిచి పోవుట
మా కిన్నియు నిలుచు నొక్క మధురస్మృతులై. 8

తల్లి కంకిత మిచ్చెను తండ్రి చరితఁ
గలిత రసబంధ కావ్యంబుగా నొనర్చి
యీఁగె నీ కరిణిఁ బితౄణ మిట్టిసేఁత
మన చిరంజీవి ధన్యుండు మాన్యుఁ డయ్యె. 9

"విద్వత్కవిశేఖర"
యార్లగడ్డ సుబ్బారావు

# నీరాజనము

బహిరుద్గ తత్రత యీ భంగి రుంద్ర లలాట
రారాజ దూర్ధ్వ పుండ్రముల వాఁడు
కర్ణకుండల రత్నకాంతికి ర్మీరిత
కమనీయ గండ యుగ్మంబు వాఁడు
సంత తాష్టాక్షరీ జపపూత గళలంబి
తులసి కాప్రాలంబ కలన వాఁడు
ఆజానుబాహు భుజాంకిత మహనీయ
శంఖ చక్రాఢ్య లక్షణము వాఁడు
యజ్ఞోపవీత విన్యాసాస్ప దోత్తుంగ
వా మాంసమున పల్లెవాటు వాఁడు

శాంత గంభీర మోహ నాస్యంబు వాఁడు
సరస సాహిత్య మధుర భాషణము వాఁడు
సస్మితుండగు శ్రీనివాస పెరుమాళ్ళు 1
విహరణము సల్పు వైకుంఠ వీధులందు.

ఆంధ్ర గీర్వాణ భాషాంభో నిధానంబుఁ
ద్రచ్చి లోగొన్న మంథాన శిఖరి.
ఆమ్నాయ నుత విశిష్టాద్వైత సిద్ధాంత
తత్త్వ విజ్ఞాన సుధాపయోధి
సంసార సాగర సంతరిష్ణు ముముక్షు
బహు శిష్య తారక భద్రతరణి
మాధవ పాదాబ్జ మకరంద నిష్యంద
పరిమళ లోలుప బంభరమ్ము

భక్తి సంగీత నిష్ణాత పరభృతమ్ము
ఆగమ శిఖామరాపగా హంసకంబు
స్వచ్చరిత్రుఁడు శ్రీనివాసపెరుమాళ్ళు
కానరానేరఁడిఁక మన కన్నుఁగవకు.

అంతేవాసులకై యహర్నిశము వేదాంతార్థ బోధా పరి
శ్రాంతిం జెంది వికుంఠ ధామమున విష్వక్సేన సాయుజ్య వి
శ్రాంతిం బొందితివిగాక మృత్యు పదవాచ్యంబైన రాక్షసి
చెంతం జేరఁగ సాహసింపఁగలదే? శ్రీ దేశిక గ్రామణీ! 3

పండితమౌళి! నీ సుతులు పండిత పుత్రులు కాక, శేముషీ
మండను లుత్తమాభిజన మాన్యు లుదాత్తులు ప్రాక్ప్రతీచికా
ఖండ విశిష్ట సంస్కృతి వికాస విరాజితు లౌట యెంచినం
బండిన నీ తపస్సు పరిపాకము గాదొకా? దేశికాగ్రణీ! 4

కన్న ఋణంబుఁ దీర్ప నొక కావ్యము వ్రాసిన పుత్రుఁ డెవ్వఁడో
యన్న! భవత్తనూజుఁడు వృషాద్రిపతి ప్రథితాభిధానుఁడే
క్రొన్నన వేర్చి పేర్చి సమకూర్చిన దండ వినీత చిత్తుఁడై
కన్న యనుంగు తల్లి పద కంజము లందిడి మ్రొక్కఁ గాంచితిన్. 5

నీ సోదర్యు లశేష శాస్త్ర ధిషణా నిష్ణాతులుం ద్వత్పద
న్యాసోదాత్త పథాధ్వనీనులు ముకుందారాధనా తత్పరుల్
నీ సంస్కారము సోఁకనట్టి శిశువొండే నీ కుటుంబమ్మునన్
వాసోగ్రాస పరాయణంబు జనియింపంబోదు ముమ్మాటికిన్. 6

విద్వాన్ స్వార్థ పరాయణో యది భవానే కాంత దేశ స్థితో
మోక్షార్థీ నియతేంద్రియ వ్యతికరోఽతప్స్యత్ తపః కేవలం
నైతత్త్వయ్యుప పచ్యతేహ జనతా సంతార యిష్ణుర్యతో
భక్త చ్ఛాత్ర జన ప్రబోధ నిరతోఽనైషీద్భవాన్ జీవనమ్. 7

తస్మాన్మాకురు భోగ యోగనియతాం స్వర్గాప వర్గ స్పృహాం
లోకోఽయం పహు కామలోభ నిరత స్తృష్ణాది సమ్మోహితః
దుఃఖాదు ద్విజతే జరామరణజా దుర్ధర్షు మేనంపున
సీస్వకారళ్యం భవతో త్తమాభి జననే స్వీయే వపుః పావనమ్. 8

# సంస్మృతి

"శాబ్దికాలంకార"
గిద్దలూరు చెంచుబసవరాజు

శ్రీమద్వైష్ణవ దివ్య భక్తి కలనా సిద్ధాంత రంగుండు, స
త్ప్రామాణ్యామల భవ్యతర్క ఘటనా వాగర్థబంధుండు, ప్ర
జ్ఞా మంత్రాక్షర పాటవోజ్జ్వల కళా సంసంగ పౌరాణికా
సామాన్యుండగు శ్రీనివాస బుధుఁడంచద్భక్తి సిద్ధుడగున్. 1

కర్మయోగము మఱి జ్ఞాన యోగము భక్తి
యోగము సముదంచి తాగమోక్తి
శిష్యులకు వచించు సిద్ధుండు శ్రీనివా
స పెరుమాళ్ళు గురుడు సన్మనీషి. 2

పుత్త్రానందము శ్రీనివాస విబుధున్ బొందంగఁ జేకూర్చి స
త్పుత్త్రుండై యల కన్నతండ్రి ఋణమున్ బోకార్చె
సత్కావ్య సు
క్షేత్రంబందు సువర్ణ ధాన్య నవరాశిన్ ప్రోదిఁ గావించి స
న్మిత్రుండై యలరున్ వృషాద్రిపతి పేర్మిన్ మొవ్వ
వంశాబ్జుఁడై. 3

"కవిభూషణ"
కర్నాటి వేంకటేశ్వర చౌదరి
కాశీపతి సాహితీ సమాఖ్య - కార్యదర్శి

మాన్యుడు శ్రీనివాస పెరుమాళ్ళు శరీరము వీడి, తా నసా
మాన్యత విష్ణులోక పదమందను డయ్యెను, మౌనిలోక మూ
ర్ధన్య పవిత్రమార్గ పరతంత్ర విశిష్టత శిష్య సంతతిన్
ధన్యుల జేసె నిట్టి గుణధాము నుతింప గతించు దుర్గతుల్. 1

జనకుని జీవిత చరితము
నను వుగ రచియించి శ్రీ వృషాద్రిపతి కవీ!
జనగణ మాన్యుడవైతివి
మనుమా! నూరేండ్లు కీర్తి మాన్యుండవుగన్. 2

"ఆశుకవితా కేసరి"
"అవధాన సరస్వతి"

# ఆశీస్సు

ప్రసాదరాయకులపతి
శ్రీనాథ పీఠ నిర్వహణాధ్యక్షులు

1. జ్ఞాన తపస్సు చిద్గగన చంద్రికయై ఫలియించి, దైవ స
న్మానము శ్రీనివాస పెరుమాళ్ళు బుధాగ్రణి రూపమొంది వి
ద్యా నిలయంపు సత్కథను తత్సుతుడైన కవీశ్వరుండు తే
జోనిధి యా వృషాద్రిపతి సూరులు మెచ్చ రచించె భక్తితో.

2. స్నిగ్ధరస స్రవంతికలు నిండిన తంద్రి హృదంగణమ్ములో
దుగ్ధ పయోధులం పెరిమతో మధియించి, మనోజ్ఞ మాధురీ
ముగ్ధ సుధల్ కళా కలిత మోహన రీతిని భక్తిభావ స
మృగ్ధన భాండమై వెలయ మంచి మనస్సున తీర్చె నీతడున్.

3. లలిత పదాంత వాఙ్మయో జ్జ్వలిత మూర్తి
వైష్ణ వాగ్రణి హరి లోక పారిషదుల
మూర్తి గాంచిన యద్భుత పుణ్య వేళ
ఉదయ మొందిన కావ్య మభ్యుదయ మందు.

4. నాపై భక్తినిచూపు గౌరవ పథానన్ సాహితీయాత్రలో
చూపున్ గౌరవ మెల్ల వేళలను శిష్యుండై వినీతిస్ఫుర
ద్రూపుండీతడనన్ వృషాద్రిపతి, యుద్యోతించు, ఈ చిత్ర కై
ఙ్కోపాధ్యాయిక నేటిరోజులను మెచ్చున్ గొల్చు నా కెప్పు
డున్.

5. పరమాత్మీయుడు, భక్తి భావుకుడు, భవ్య స్వచ్ఛ గంగానదీ
స్ఫురణో దంచిత కావ్యగాన లహరీ శోభా నముల్లాస సుం
దర వాగ్వైభవ తత్పూత సంకల్ప భా
సుర సిద్ధిన్ బడయంగ వాక్కును మనస్సున్ జేర్చి
దీవించెదన్.

# శుద్ధప్రతి

| పుట | పంక్తి | పద్యసంఖ్య | ఉన్నది | ఉండవలసినది |
|---|---|---|---|---|
| 8 | 6 | 11 | మోక్షపాప్తులం | మోక్షప్రాప్తులం |
| 9 | 2 | 15 | నన్నుగురించి | నన్నుగురిచి |
| 9 | 8 | 16 | దాయకంబగును | దాయికమయగు |
| 9 | 9 | 17 | సిద్ధాంత | సిద్ధాంతమే |
| 9 | 10 | 17 | మాతంబుచే | మాత్రంబుచే |
| 9 | 19 | 19 | నొక్కడ గుదెంచి | నొక్కడవేగుదెంచి |
| 11 | 9 | 27 | వృకపాళీ | వృకపాళి |
| 12 | 12 | 30 | నీ ల | నీవేల |
| 13 | 16 | 33 | నధికమగును | నధికముగను |
| 15 | 11 | 41 | శేముషి | శేముషీ |
| 17 | 19 | 8 | లక్ష్మీ | లక్ష్మి |
| 18 | 1 | 9 | వర్ణింపదగున్ | వర్జింపదగున్ |
| 19 | 14 | 17 | పుంజికటిన్ | పుంజీకటిన్ |
| 19 | 17 | 18 | మొక్కసారిగా | మొక్కసారిగ |
| 20 | 2 | 19 | కుత్సగతిస్ | కుత్సగతిన్ |
| 20 | 5 | 20 | మాలిని | మానిని |
| 21 | 2 | 24 | నింటిలొపలనె | నింటిలోపలనె |
| 21 | 10 | 26 | తమ | తను |
| 22 | 12 | 31 | దుక తన | దు కతన |
| 22 | 13 | 32 | సంకాంతి | సంక్రాంతి |
| 24 | 17 | 43 | మా తమ్ముడు | మాతమ్ముండు |
| 26 | 1 | 49 | సద్గుర | సద్గురు |
| 26 | 3 | 49 | నొక్కబిడూకునన్ | నొక్కదూకునన్ |
| 26 | 9 | 51 | సమీహిల | సమాహిత |

| పుట | పంక్తి | పద్యసంఖ్య | ఉన్నది | ఉండవలసినది |
|---|---|---|---|---|
| 26 | 14 | 52 | భక్తియె | భక్తిమై |
| 27 | 1 | 54 | స్వాతుండై | స్వాంతుడై |
| 27 | 6 | 55 | ప్రశించెన్ | ప్రశ్నించెన్ |
| 27 | 7 | 55 | పసార | ప్రసార |
| 27 | 12 | 56 | నాచార్యుండటం | నాయాచార్యకం |
| | | | చెంచగన్ | చెంచగన్ |
| 27 | 16 | 57 | వృధాకాంతకియా | వ్యధాక్రాంతక్రియా |
| 28 | 6 | 60 | పునమి | పున్నమి |
| 28 | 8 | 60 | గురుచందుడు | గురుచంద్రుడు |
| 28 | 14 | 62 | కొల్చనన్ | కొల్చినన్ |
| 29 | 14 | 67 | పిగ్ధంబు | స్నిగ్ధంబు |
| 29 | 17 | 68 | కనుగంతల | కనుగ్రంతల |
| 30 | 2 | 69 | స్నానపానములు | స్నానపానములిధం |
| | | | ఆబాలగోపాల | బాబాలగోపాల |
| 30 | 9 | 71 | మయూర | మాయూర |
| 30 | 16 | 72 | నిప్పంటించెన్ | నిప్పంటించెనుస్నాతుడై |
| | | | గృతస్నాతుడై | |
| 34 | 11 | 12 | మొవ్వవారులు | మొవ్వవారల |
| 36 | 10 | 20 | చరితను | చరిత్రను |
| 37 | 9 | 24 | మయుడైన | మయుడైన |
| 37 | 14 | 25 | పాపితానేక | ప్రాపితానేక |
| 38 | 9 | 28 | వెనదించి | వెనదించి |
| 38 | 16 | 28 | ంకటదాస | వేంకటదా |
| 38 | 17 | 29 | ప్రతిప్రతా | పతివ్రతా |
| 42 | 16 | 45 | తర్షింతున్ | తర్షించున్ |
| 42 | 20 | 47 | యవ్వానము | యౌవనము |
| 44 | 6 | 54 | విభినతత్వ | విభిన్నతత్వ |
| 45 | 2 | 56 | వవ్యకరమున | సవ్యకరము |



| పుట | పంక్తి | పద్యసంఖ్య | ఉన్నది | ఉండవలసినది |
|---|---|---|---|---|
| 47 | 12 | 68 | పా క్తనజన్మ | ప్రాక్తనజన్మ |
| 48 | 20 | 70 | వరలకున్నే | వరలకున్నె |
| 48 | 4 | 71 | పియత | ప్రియత |
| 48 | 12 | 73 | కృతినివెసె | కృతినివేసె |
| 48 | 15 | 74 | భరణమిదియే? | భరణమిదియె? |
| 49 | 1 | 76 | తనతెల్వికిన్ | తనతెల్వికిని |
| 49 | 10 | 78 | మోదింపపిచ్చి | మోదింపకపిచ్చి |
| 51 | 15 | 89 | దేశకునితో నేతెంచెనీచిత్ర | దేనికునితో లేచెన్ బళీ! చిత్ర |
| 52 | 11 | 93 | శోత్ర | శ్రోత్ర |
| 54 | 10 | 103 | కొఅకుగుఙ్తి | కాడుకుగుఙ్తి |
| 54 | 14 | 104 | విజ్ఞులు దవిశిష్ట | విజ్ఞులువేదవిశిష్ట |
| 54 | 17 | 105 | చెల్లెండ్లు | చెల్లెండ్రు |
| 56 | 14 | 114 | లద్విధంపు | తద్విధంపు |
| 57 | 15 | 119 | వెళకు | వేళకు |
| 58 | 16 | 124 | మనవాంఛలుగింఛలు | బలితంబగువాంఛలు |
| 59 | 7 | 127 | యొక్కటియెచాలు | యొక్కటిచాలు |
| 61 | 11 | 138 | కాళ్ళపైబడిన్ | కాళ్ళపైబడెన్ |
| 62 | 16 | 144 | తీసికువచ్చిరి | తీసుకవచ్చిరి |
| 63 | 7 | 147 | ఘటిపింప | ఘటింపింప |
| 65 | 17 | 160 | అతిపవిత్రములష్టాదశాగ్ని కుండ | అతిపవిత్రమ ష్టోత్తరశతముకుండ |
| 66 | 15 | 164 | పతనాత్రేంత | పతనాక్రాంత |
| 66 | 19 | 165 | జలశ్చసంచార | శ్చలసంచార |
| 66 | 20 | 165 | నల్వస్వామి | జ్వలనస్వామి |
| 67 | 10 | 168 | ప్రజ్ఞారానుల | ప్రజ్ఞారాసుల |
| 67 | 12 | | 163 | 168 |

| పుట | పంక్తి | పద్యసంఖ్య | ఉన్నది | ఉండవలసినది |
|---|---|---|---|---|
| 67 | 20 | 170 | నిర్థిష్టములైన | నిర్దిష్టములైన |
| 68 | 17 | 3 | సద్గుని | సద్గురుని |
| 68 | 17 | 3 | ఆశయమంది | ఆశ్రయమంది |
| 68 | 20 | 3 | భాతకు | భ్రాతకు |
| 68 | 20 | 3 | బుదిధ్యై | బుద్ధియై |
| 69 | 12 | 6 | నెమ్మినమంబుగ | నెమ్మిసమంబుగ |
| 70 | 2 | 9 | సంధ్యా ళ | సంధ్యావేళ |
| 72 | 9 | 21 | ఇట్టి విలోక | ఇట్టివి లోక |
| 72 | 12 | 21 | గురూ ్తము | గురూత్తము |
| 75 | 7 | 31 | గ్రాసనమందలం కృతులుగా | గ్రాసనమం దలం కృతులుగా |
| 75 | 15 | 33 | పచురభావము | ప్రచురభావము |
| 77 | 6 | 2 | ఖ్యాతిగాంచి | ఖ్యాతిగాంచె |
| 77 | 13 | 2 | కూతులమరు | కూతు లమరు |
| 78 | 12 | 3 | దివిసీమన | దీవిసీమన |
| 80 | 11 | 10 | నింపొందుసట్టియు | నింపొందునట్టి, యు |
| 81 | 2 | 11 | క్రమగుణుండు | కమ్రగుణుండు |
| 81 | 17 | 12 | శ్లాఘ్యచరిత | శ్లాఘ్యచరిత్ర |
| 81 | 19 | 12 | ంకటనగరాయ | వేంకటనగరాయ |
| 82 | 2 | 12 | కమ్రవర్తనుడైన | క్రమవర్తనుండైన |
| 85 | 10 | 3 | లెవ్వేళను | లెవ్వేళను |
| 86 | 10 | 7 | కోరికల నంతము | కోరిక లనంతము |
| 86 | 12 | 7 | తర్పరులై | తత్పరులై |
| 86 | 15 | 8 | రేణురవార్ధి | వేణురవార్ధి |
| 88 | 11 | | పవచించి | ప్రవచించి |

# సమర్పణము

ఎన్నిక నెన్ని జన్మముల నెత్తిన తండ్రి ఋణంబు తీర్పగా
నున్నదె? తల్లిదండ్రులకు నొండొక మించిన దైవమున్నదే?
కన్నుల గట్టు దైవములు కష్టముతో కనిపెంచి యన్నిటన్
మిన్నల జేయ నిత్యము శ్రమించిన తద్విధికిన్నమస్కృతుల్. 1

భువిమాతౄణ పితౄణముల్ ఋషి ఋణంబున్ దీర్పరాదంచు
ద విశేషజ్ఞులు, ధర్మమూర్తులు, తపోధన్యాత్ము, లాదర్శ భా
వ విధేయుల్ కొనియాడుచుండ కడు నల్పజ్ఞుండ హీనుండ సే
పవిదిన్ దీర్చెద? నిండు డెందమున సద్భక్తిన్ సదా కొల్చెదన్.2

తినినన్ తా తినకున్న బిడ్డలకు నెంతే ప్రేమ నిండార భో
జనమున్ గూర్ప శ్రమించి, ప్రాచిరుగు వస్త్రంబుల్ మెయిన్
దాల్చి నూ
తన వస్త్రంబు లొసంగి, దుర్భర దరిద్రత్వంబులో సైతమున్
తన సంతానపు వృద్ధిగోరు జననీత్వశ్రీకి జోహారువుల్. 3

కొడుకులు పుట్టిరంచు కడు గొప్పగ నెంచి శ్రమించి విద్యలన్
బడయగజేసి సంతసిలు స్వార్థ మెఱుంగని తల్లి గుండియల్
తడిపిన ప్రేమ మాధురికి లక్షలు కోట్లు ధనంబొసంగినన్
బడలక జీవితాంతము సపర్య లొనర్చిన నప్పు దీరునే? 4

కడుపున బుట్టి నీ యొడలి కండలు పిండిన రక్తధారలన్
గడిది బలంబు చెంది వెలగట్టగ రాని త్వదీయ సేవ ని
య్యెడ గడిదేరి యుల్లసిలు నీతను వొక్క ప్రసూన మట్లు నీ
యుడుగుల చెంత నూడిగమునందు తరించిన చాలు తల్లిరో! 5

నేనును, నాదు తమ్ములును నెయ్యపుతిట్టులు తోడబుట్టువుల్
పూనిన భక్తిబంధమున, భూతలమందిక నెన్నిమార్లు జ
న్మానకు వత్తు మన్నియును మారులు నీదు పవిత్ర గర్భగో
ళాన జనింపతా వొసగి లాలన మమ్ము ననుగ్రహింపుమా!

కన్నుల నీరు నింపకుము గాటపు వేదన క్రుంగబోకు మీ
తెన్నున నాన్నగారి కొని తేరగ నేరముకాని, కొండపై
నున్నను కోతినైన నిదిగో కొనితెత్తుము, లోపమొక్కటే
నెన్నడు చేయమంచు వచియించెద నీ పదపద్మ సాక్షిగన్

ఎంతటి గొప్పవా రగుదురేనియు తండ్రి గతింప దిక్కు మొ
క్కింతయు లేని పక్షులుగ నెగ్గులుగాంతురు; మాకు మీరలు
న్నంతన లోపమన్న దిసుమంతయు కానగ రాకయుండన
శ్రాంతము ప్రోచిపెంచితిరి చాలును జన్మఫలంబు పండెడిన్

లక్షలు కోట్లు కూర్చి పదిలంబుగ సంతతికిచ్చి పోయినన్
దక్షులుగాని పుత్రకులు దానిని సక్రమతన్ వ్యయింతురే?
అక్షయ తృప్తినందుదురె? హాయి వహింతురె? కీర్తిగాంతురే?
లక్షలమిన్న జ్ఞానము బలంబుగ నిచ్చితిరింక చాలదే?

నీ యనురాగ వర్ష నవనీరముచే మొలకెత్తి, నీదు సే
వాయతి వృద్ధిచెంది పొలుపంది సుమించిన తీవలమ్మ! మా
యీ యనుపైన జీవితము లియ్యవి నీ మృదు పాద పూజనా
ధేశియము లైనగాని మరి తీరునె యింతటి జన్మబంధముల్

తరి మాగుండెలు దేవళమ్ముగ నినున్ తద్దేవతా మూర్తిగా
నిరతిన్ భావ సువర్ణ నీరజ రజో నీరాజనాలెత్తి, క్రొ
వ్విరులా, మా హృదయాళి దీపశిఖగా వెల్గించి నీ మూర్తిలో
పరమానంద వినీతి గాంచమె పరబ్రహ్మైక్య సాక్షాత్కృతిన్ 11

అమ్మవెయైన నాన్నవయినప్పటి కిప్పుడ నీవకావె మా
కిమ్మగు దిక్కు, నీదుసుఖమేకద మాకుముదమ్ము; నాల్గుకా
లమ్ములపాటు నీవయినహ్లాదముతో వసియించియున్న చే
తమ్ములు చల్లగా కడుముదమ్మున సాగమెనీదు దీవనన్ 12

జననీ! మా జనకుండు నిర్మల తపస్స్వాధ్యాయ సిద్ధుండు చి
ద్ఘన తత్త్వార్థ సుధాతరంగిత మహాధర్మాబ్ధి; స్వచ్ఛంద రీ
తిని వైకుంఠము చేరనేగె, నిది తద్దివ్యచ్చరిత్రంబు, దీ
నిని నీకంకితమిత్తునైకొని దయన్దీవించి మన్నింపవే! 13

జననీ! యియ్యది మీపవిత్ర పదపూజాధారణా ధీన ధీ
వినయోపాత్త భవత్తనూజ హృదయావిష్కార, మిద్దాని స
త్ప్రణు తాధ్యాత్మిక భారతీకరగత ప్రాలంబహేలా సరో
జ నిధానంబగు నీ కరద్వయమునన్ సద్భక్తి నర్పించెదన్ 14

అమ్మకు - సర్వ విశ్వమున కాస్పదమైతగు మూలశక్తి రూ
పమ్మున - కాదిలక్ష్మి గుణభావన వర్ధిత సంపదాత్మకున్
కమ్మని నామవర్ణ జపకారణ మాత్రన ప్రాణికోటి చే
తమ్ముల శాంతి సౌఖ్యముల తన్పెదు నంబకు - బాలమాంబకున్ 15

# సువర్ణప్రాంజలిః

ధ్యానవైభవ సంపన్నం - శిష్య వాత్సల్య వారిధిమ్
పూజ్యకారణ సంభూతం - శ్రీనివాస గురుంభజే 1

పాపారణ్య దవజ్వాలం - సంసారార్ణవతారకమ్
జన్మరోగభిషగ్వర్యం - శ్రీనివాస గురుంభజే 2

బాలమాంబా మనోగేహం - జ్ఞానధారణ మోహనమ్
పౌరాణిక గణశ్రేష్ఠం - శ్రీనివాస మహంభజే 3

సత్యవిజ్ఞాన ధర్మజ్ఞం - కర్మదోష వివర్జితమ్
సర్వలౌకిక దోషఘ్నం - శ్రీనివాస మహంభజే 4

భక్తి భావ సమాకీర్ణం - తాప-షడ్వర్గ నాశకమ్
మాయాధ్వాంత లసద్భానుం - శ్రీనివాస గురుంభజే 5

వేంకటాఖ్య తనూజాయ - జ్ఞానవైరాగ్యశాలయే
రామాంఘ్రి లగ్నచిత్తాయ - శ్రీనివాసాయతేనమః 6

రామానుజ స్వరూపాయ - కరుణామృత సింధవే
జ్ఞానభక్తి ప్రబోధాయ - శ్రీనివాసాయతేనమః 7

గోపాల దేవ పదపద్మ చరన్మిళిందమ్
శ్రీ భాష్యకార చరితామృత పానమత్తమ్
శ్రీ పూడివాడ పురమందిర లగ్నచిత్తమ్
శ్రీ శ్రీనివాస గురుదైవత మాశ్రయేహమ్ 8

# పరమపదఖండము

ఓ జగదేక నిర్మల మహోన్నత పూతచరిత్ర! నిత్య గీ
తా జప శుద్ధమానస! విదారితకల్మష! రామపాద నీ
రేజ మధువ్రతా! గుణవరిష్ఠ కవిత్వ మహత్త్వ! శిష్య సం
భ్రాజిత! శ్రీనివాస పెరుమాళ్ళ గురూ! కొనుమా నమస్కృతుల్.1

మన బావి నీటి నిమజ్జనంబున కంటె
విరజానదీ స్నాన విధి ఘనంబె?
వేణుగోపాల సంభృత దర్శనము కంటె
నట విష్ణు దర్శనం బతిఫలంబె?
మాయమ్మ వడ్డించు మహితాన్నముల కంటె
నమృత భోజన తృప్తి యధికతరమె?
పూడివాడ నివాస భోగంబు కంటె, వై
కుంఠవాసము పుణ్యగుణ తమంబె?

పరమ పండిత సోదర భాషణంబు
కన్న నిత్య సూరుల గోష్ఠి మిన్నయగునె?
విరతి హరిదాసులను మమ్ము విడిచి చనగ
నేమి తొందర వచ్చె? నిట్లేగ స్వామి! 2

శ్రీరామాధవ! తర్కశాస్త్ర విధి చర్చింపన్ మనస్సాయెనో?
శ్రీరామాయణ భారతాదిక కథాశ్రేణిన్ బురాణంబుగా
పౌరోదారత వీనులార విన నుత్సాహంబు రెట్టించెనో?
నూరేండ్లాయెనొ? శ్రీనివాస గురునిన్ గొంపోవ నే హేతువో?

అచ్చర లైదువలు, తరుణాంచిత దర్శన, లద్భుత ప్రభా
పిచ్ఛిల చంచలా లతలు, వీణెలు మీటుచు సామవేద సం
పచ్ఛలితంబుగా శ్రుతులు పాడుచు లాస్య విలాస వైఖరిన్
ముచ్చట గొల్పుచున్ తమకు ముందఱ సాగిరె యుత్సవంబుగన్. 4

విరజానదీ స్వాదు విమలోదకములందు
పావన స్నాన సంపద వహించి
మోమున తిరుమణి పుండ్రంబు సవరించి
గళసీమ తులసి మాలలు ఘటించి
కరముల శంఖ చక్రంబులు కైసేసి
లలిత పీతాంబరం బలవరించి
వలిత కేయూర కుండల హార దివ్య భూ
షణములు మెయినిండ సవదరించి

జయుడు విజయుండు ముందు హెచ్చరిక సలుప
నిత్య సూరిగణంబు వెన్వెంట నడువ
సూత్రవతి భర్త హర్ష విస్ఫూర్తి మిమ్ము
శ్రీ మహావిష్ణు సన్నిధిం జేర్చెనేమి? 5

కోటి సహస్రభాను రుచి గుంఫిత కాంతి కళా ప్రవాహమై
హాటక కుడ్యగోపుర మహామణి మంటప భాసమానమై
ఘోటక మత్తవారణ విఘూర్ణిత సర్వ దిగంతరాళ వి
స్ఫోటమునై వికుంఠపురి పొల్చెనె? శ్రీ మహిమాభిరామమై. 6

వాటము దుష్టకామిత కవాటము మోక్ష పథ ప్రభా నిరా
ఘాటము సుందరోపవన కాంచన శైల సువర్ణ వల్లరీ
ఝూటము సిద్ధసాధ్య సుర సంయమి సంఘనుత ప్రకీర్తనా
ఘాటము శ్రీ వికుంఠపురి కాంచితిరా ? హరి రాజధానినిన్. 7

పండువుగా రమారమణి పాదములొత్త సువర్ణహార స
న్మండన కాంతినేలు తిరుమామణి మంటపమందు, యోగిరా
ణ్మండల మెల్ల కొల్వ ఫణి నాయక తల్పముపై శయించి, తా
నుండెనె ఆది దేవుడు ? మహోన్నతి మిమ్ముల చూచువేడుకన్. 8

జయుడును విజయుండు స్వర్ణవేత్రాలతో
పరమ జాగృతి బరాబరులు సేయ
ఘనుడు విష్వక్సేను డనయంబు సాహో ని
నాదాలతో మ్రోల నడచుచుండ
గరుడుండు భక్తి సంభరితుండు ధర్మ వి
శుద్ధుండు వెనుక వీచోపు లిడగ
బ్రహ్మ రుద్రేంద్రులు పాణులు మోడ్చి కిం
కుర్వాణులై ప్రక్క కొలిచి నిలువ

శ్రీనివాస గురూత్తముల్ చేర వచ్చి
రనుచు నెదురుగ నాది నారాయణుండు
పోవు తరి సురబృందముల్ మూగదరిని
చూచువారలే ధన్యు లస్తోకధనులు. 9

వేదంబు లుపనిషత్తులు
మోదంబున దివ్యరూపములు దాలిచి, ఆ
హ్లాదమున మీ చరిత్రం
బాదరమున నాడిపాడెనా ? గురుదేవా ! 10

తమ యంశన్ భువి నేటిదాక భగవద్ధర్మ ప్రబోధంబె ల
క్ష్యముగా తీరిచి బద్ధచేతనుల మోక్ష ప్రాప్తులం జేసి వ
చ్చె మహాత్ముండని, ఆళువారలు నినున్ సేవించి, ఆలింగన
ప్రముదాంతః కరణంబులన్ పరవశత్వం బందిరా ? సద్గురూ ! 11

మహిమన్ వేంకటదాస దివ్యముని, యుష్మత్తాతపాదుండు, స
న్నిహితుండై సతి రాధమాంబ సరసన్ విచ్చేయగా వచ్చి, స
ర్వహితాపాదక దృష్టి నీదు శిరమాఘ్రాణించి ఆశీర్వచో
వహ దివ్యాక్షర నిర్మలాక్షత లొగిన్ వర్షించి హర్షించిరా ? 12

పావన పద్మజారమణి పాద సపర్యల తేలు, పుణ్య సం
భావితశీల, భార్గవి భవత్సుత, మాయనుజాత మీ పవి
త్రావహ పాదపద్మముల నంటి నమస్కృతు లాచరించి, యా
పోవని ఆశిషంబులను పొందినదా ? స్వకుటుంబ సంగతిన్. 13

మనుమ డుదయించె నట వాని కనెడు భాగ్య
ఫలము నోచని దురదృష్టవంతురాల
పేర్మి వానికి నాపేరె పెట్టినట్టి
త్వద్దయకు నోచిన అదృష్టవంతురాల. 14

తపస్సిద్ధి

అన్నలు తమ్ములు చెల్లెలు
నన్నుగురించి యెప్పుడైన నయనాశ్రు జలం
బు న్నింతుర ? మన్నింతుర ?
మన్నామము జ్ఞాపకముగ మది నిల్పుదురా? 15

అనుచు ప్రశ్నించు భార్గవి నక్కునందు
చేర్చి లాలించి కన్నీరు కార్చినారె?
చిర వియోగము తరువాత వరలు సంగ
మంబధిక హర్షదాయకం బగును గాదె? 16

అనఘుండై కులభేద మెంచక విశిష్టాద్వైత సిద్ధాంతమే
ఘనుడా శాంతము నిల్పి, చేతనుల సంకలైవిక మా తంబు చే
తనె నిత్యోత్సవ మోక్ష రాజ్య పదవీ ధన్యాత్ములం జేసె, నా
ప్రణవాకారు ఫణీంద్ర వాజ్మలయు శ్రీ రామానుజుం గంటిరే? 17

శ్రీ రామానుజ పాదపద్మ యుగళిన్ సేవించుచో తాను, వ
త్సా! రాజెల్లునె ఏగ? ఏము శత సంఖ్యాధిక్య వర్షంబు లు
ర్వీరాజ్యంబు మత ప్రచార విధి వ్యాప్తిం జేయమో? నీవు నీ
యారోగ్యంబును గూర్చి పల్కెదవదే ప్రారబ్ధ కర్మంబిలన్. 18

మానవసేవయే వినుత మాధవసేవ యటంచు తెల్పిమో,
దీనులు జన్మరోగ పరిదేవను లందఱ నుద్ధరించి మో
క్షానకు పంపుటల్ ఫలమొ? గ్రక్కున నొక్కడ ఏగుదెంచి యీ
మానిత దివ్యలోక పరిమాణ సుఖంబుల చొక్కుటందమో! 19

త్వరతో నీజనకుండె వచ్చెనని బాధంజెందు కాలంబున
న్నిరతిన్ నీవటులే యొనర్చితివి, కానీ మించిపోలేదు ని
ర్భర కారుణ్యవశం వదుల్గలరు, విద్వాంసుల్ భవత్సోదరుల్
ధరవారైన స్థిరంబుగా నిలిచి తత్కార్యంబు సాధింపరే? 20

ఇకపై జన్మము లేదటంచు హరియే యేతత్క్వచిత్కర్మరూ
పక దోషంబు తొలంగజేయ రుజ నాపాదించె, నీవింత బా
ధకె సైరింపవటే - ప్రపత్తి యనుసంధానించి నావంతు - నా
రక బాధాపరితప్త మానవుల సంరక్షింప భావింపవో? 21

రామ! రామ! యనుచు ప్రాణముల్ విడిచిన
ధన్యుడేడి నీవు తక్క ధాత్రి?
అనుచు నిష్ఠురోక్తు లాడి తొల్దొల్లగా
పిదప పొగడినారె మృదుపదాళి? 22

అంతట వేంకటాఖ్యముని యందుకొనెన్ "కనుమోయి! చిత్త వి
భ్రాంతి పరీత వృత్తి పరిభావితులై హరిదాసు లెట్లు వ
ర్తింతురో? దైవనింద నొనరింతురో? కన్గవనెట్లు బాష్పముల్
నింతురో? నీ వియోగ భవనిష్ఠుర తాప విధూతులౌదురో? 23

హరిదాసుల్ దరహాస బంధురులుగా, ఆధ్యాత్మిక జ్ఞాన త
త్పరతామోద ముముక్షు మార్గ పరితృప్త స్వాంతులం జేసి, ని
ర్భర కారుణ్య ధురీణ మానసము వైరాగ్య ప్రభావాహినీ
భరితంబై సకలంబు విష్ణుమయతా వర్ధిష్ణుతాపాదిగన్. 24

---

పరతత్త్వామృత సారవీచుల పరబ్రహ్మైకత్వ సంధాన భా
వ రిరంసోద్ధృతి తామరాకుపయి సంవర్తించు నాపః కణా
ఖిరతిన్ లౌకిక కార్యనిర్వహణ సంప్రీతిన్ మహోదాత్త సు
స్థిరతా పాదక పారలౌకిక నిఃశీభూత చిత్తుండవై. 25

చిరకాలంబు వసించి, లోకమును పుంజీభూత భక్తి ప్రభా
కరధామంబొనరించి విష్ణుపదకాంక్షా తత్పర స్ఫూర్తి, గ్ర
చ్ఛర వైకుంఠము చేరరమ్మనుచు నాజ్ఞాపించినా, నింత తొం
దర యేలంచును మాపితామహులు నిన్ బ్రశ్నించిరా? సద్గురూ! 26

కాపరిలేని గొఱ్ఱెలు కకావికలై వృకపాళి నోటికిన్
దాపురమైన రీతి పరతత్త్వ మహత్త్వ గురుండు లేనిచో
కాపురమే సమస్త సుఖకారణమన్న దురంత చింతనో
ద్దీపిత షడ్వికార పరితృప్తి చరింతురు గాఢ వాంఛలన్. 27

వారల తీర్చిదిద్దుటకు వచ్చుచు పోవుచు నుందునంచు శ్రీ
నీరజనాభుడాడడె? జనింపక చావక యొక్కచోట ల
క్ష్మీ రమణాంఘ్రి సన్నిధి రమించిన శ్రీశ విలాస కల్పితో
ద్భూరి శుభప్రదోభయ విభూతుల కర్థము పర్థముండునే? 28

తిరమౌ నిత్యవిభూతి నిర్గుణచణాప్తిన్ యోగనిద్రాము హ
త్తరు డానంద జగన్నియామకత నంతర్దర్శనారూఢుడౌ
హరియే సర్వ గుణాన్వితుండగుచు లీలాకల్ప లీలావిభూ
తి రతిన్ తా నవతార పర్వముల నుద్దీపించుటల్ క్రొత్తలో? 29

శిష్యవత్సలుడు ప్రసిద్ధుండు వేంకటా
చలపతి జ్ఞాన విస్తార గురుడు
శాస్త్ర సాగర కుంభసంభవుండైన దా
శరథి సూరి జగదాచార్య వరుడు
రమణీయ చరితుండు రామప్రసాదు వి
శాల చిత్తుడు భక్తి సంయుతుండు
పతిపదార్చనశీల ప్రముదిత గుణజాల
రామబాణమ్మ శ్రీరమణి తుల్య

భక్తి తత్పర సద్గుణ భావ నిరత
ప్రథితనుత కమలాదేవి భవ్యశీల
నీదు నెడబాటు సైపక నిరుపమాన
బాధపడు సుతా? నీవేల వచ్చితిట్లు? 30

భవదీయాగ్రసుతుండు నిస్తులపు దౌర్భాగ్యుండుగా నెంచి నీ
వపురా! అంతిమ దర్శనంబునకునే నర్హుండు కాడంచు, న్యా
య విధానంబును విస్మరించితివె? వత్సా! కాని తద్వేద నో
ద్భవ దావాగ్ని తదీయ చిత్తము నెటుల్ దగ్ధంబు గావించునో? 31

నీ వలెనె పురాణ నియతి సంవర్తించు
కృష్ణప్రసాదు దుఃఖించు నదిగో?
సతతంబు నీవెంట చరియించు యతిరాజ
సంపత్కుమారు విచార మరుదో?

అతులిత శోకార్తి సడలు జనార్దన
స్వామి, చిన్న కుమారు వంక చూడు
మనురాగ బంధిత ఆత్మజ జనకజా
దేవి రోదించెడు తెన్నుగనుము

మనుమలును నీదు గాదిలి మనుమరాండ్రు
ననుగు కోడండ్రు నీకునై యఖిల దిక్కు
లదుర రోదించు నార్తరావాళి భూన
భః పరివ్యాప్తమై తాకె ప్రకటలమగుచు. 32

అతులిత గుణశీల యగు పెద్ద కోడలు
పద్మాలయాదేవి బాధ గనుమ !
సాధు స్వభావయై సాగు నలర్మేలు
మంగతాయారు నార్తింగలంగు
పూత చరిత్రయౌ మూడవ కోడలు
వరలక్ష్మి రోదించు తెఱవు గనుమ
సరళవర్తన శీల సౌమ్య నాల్గవ కోడ
లగు మాధవి తపించు నధికమగును.

అతడు జామాత సద్గుణ చతుర భావ
పూర్ణుడైన రాధాకృష్ణమూర్తి మిగుల
దుఃఖమందెడు వీరల ద్రోచివైచి
కదలి యిటకురా నీకెట్లు కాళ్ళు వచ్చె ? 33

చెక్కులు నొక్కి ప్రేమగని చేరగదీసి, యిదేమిరా! సుతా!
చిక్కితి తమ్ములందఱును చెల్లెళులిద్దఱు సేమమే కదా!
మక్కువ నీ తనూభవులు మమ్ము తలంతురెయంచు రాధమాం
బక్కున చేర్చి యడ్గెనొకొ? అందరిక్షేమము పేరు పేరునన్ 34

స్త్రీలకు మేలుబంతి, కులదీపకురాలు పతివ్రతా శిరో
మాలిక శాంతి దాంతి గుణమాన్య విశుద్ధచరిత్ర నీకు ని
ల్లాలును, నాదుకోడలగు నంచితశీలను బాలమాంబనే
లీలగ వీడివచ్చితని క్లేశముతో మిము మందలించెనా? 35

నీకు తలలోని నాల్కయై నీ పవిత్ర
చరణములె జీవనంబుగా వరలుసాధ్వి
నీదునర్ధాంగి బాలమాంబా దురంత
దుఃఖజలధి నిమగ్నయై తూలెచూడు 36

అదిగొ హరిదాసు లరుదెంచి యశ్రుజలము
తర్పణంబుగ దుఃఖింప తజ్జలంబె
యొడికలుగట్టి ఘనసాగ రోర్మికలుగ
సాగుచుండె పుత్రక! విరజా జలాల 37

సరసన్ నిల్చి తదీయవాక్యములు విష్వక్సేను లాలించి, య
క్కఱలేనట్టి వసుంధరాకపు ప్రసంగంబేల? నారాయణుం
డరుదొ దివ్యపురాణమున్ వినునభీష్టావాప్తి రప్పించె న
ఙర సిద్ధంబు తదాజ్ఞకుం గలదె వైక్లబ్యంబు విశ్వంభరన్ 38

అని తిరుమామణి మంటప
మున నేర్పాటొనర జేసెపూర్ణ ప్రతిభా
చణసభ గంధర్వోరగ
ఘనఖేచర సిద్ధసాధ్య ఖచరులు చేరన్ 39

అత్తఱి శ్రీనివాసగురు డబ్ధితరంగ గభీరఘోషణో
దాత్తమహత్తరంబుగ సుధామృదు ఫక్కిపఠింప, దివ్యభా
వాత్తత వేంకటాఖ్యముని యద్భుతకాల పయోదగర్జనో
పాత్త నినాద బంధురత వ్యాఖ్యయొనర్పగ సాగె పొంగుచున్ 40

శ్రీరమారమణీ విశిష్టుడై వెన్నుడా
నందైక సామ్రాజ్య మందడంగె
అతులితశేముషి చతురుండు శేషుండు
తలలూచి పరవశత్వంబు నందె
బళిబళీ ! యిదిగదా పాకంబటంచు రా
మానుజు లానందమంది నిలిచె
ఆనంద తాండవంబాడుచు నారదుం
డతిమోద విస్తీర్ణుడగుచుపాడె

అమృతవాహినులిక యింకినప్పటికిని
నిత్యసూరులకును బాధనెగడబోవ
దనుచు వైకుంఠ పట్టణమందు కలుగు
నట్టి యాబాలగోపాల మభినుతించె 41

# చరమ యాత్రాఖండము

మీ పురాణపుఫక్కి మెచ్చియచ్చెరు వంది
    పొంగులెత్తినది త్రైలింగభూమి
మీ వేషభాషల మేటి పాటవమెంచి
    ఆనంద మందిన దాంధ్రజాతి
మీ కవితాధార మేల్మికల్మి గణించి
    పులకించినది తెల్గు పలుకుపెలది
మీ తపోవిభవంపు మించుసంచు లెఱింగి
    కై మోడ్చె నాగమజ్ఞతలంబు

బ్రహ్మవర్చో విరాజిత ప్రముఖమైన
మీ వదనసీమ వీక్షించి సంప్రీతి నించి
వినయ వినమితమయ్యె పృథ్వీతలంబు
శ్రీనివాసబుధేంద్ర! కీర్తిగుణసాంద్ర!

తానిహలోక తుచ్ఛసుఖ తత్పరతన్ విడనాడి మోక్ష ల
క్ష్మీ నిలయంబుజేర మది సిద్ధమొనర్చి ప్రయాణకాలమున్
మానసమందు నిల్పి యనుమానము కల్గకయుండ, నర్మగ
ర్భానుగతిన్ ప్రసంగముల వ్యక్తమొనర్చెగురుండు తద్విధిన్

అవుర! గడచిన శ్రీరామ నవమినాడు
పూడివాడ పురాణింప పూనిగురుడు
నేనుచెప్పు పురాణాల నిదియె చిట్ట
చివఱిదని తెల్ప ప్రజల కచ్చెరువు కలిగె

ముమతల్ పండగ మోదుమూడి యను గ్రామంబందు రామాయణం
బమితాహ్లాదము తో వచింపగ శుభ ప్రారంభముం జేసి, మో
క్షమతా భీప్సితులార! తుట్టతుదనే కావించు నే తత్పురా
ణము తాపోప శమంబు జేయు విని యానందింపు డాద్యంతమున్ 4

అని గురుచంద్రుడు డాడ వినియందఱు దుఃఖకదుష్ణ బాష్ప పూ
ర్ణనయనులై "యిటుల్ పలుకన్యాయ్యమె? మీతలపోత భావ్యమే?"
యన మృదుమందహాస వదనాంబుజుడై యిదె వార్ధకంబు పై
గొని కబళింప నీతనువు కూరగమారదొ కాలమూర్తికిన్ 5

శిలవలె శాశ్వతంబుగ వసింపగ సాధ్యమెయేరికైన ని
య్యిలపయి? సొంతయింటి కొకడేగుచునుండ నొకండు క్రొత్తగా
వలచి పరస్థలంబునకు వచ్చుచునుండును, మిత్తి సర్వజీ
వులకును నైజ, మీ తనువు పొందుటయే వికృతస్వభావమౌ 6

అనివారించెను వారి, కాని యతులాయాసంబు త్రాసంబుగా
వనటంగూర్ప పురాణమింక ప్రవచింపన్ లేక సోదర్యు చె
ప్పనియోగించి, ద్వితీయ పుత్రుని పఠింపన్ బిల్చి పౌరాణికా
గ్రణివై వర్ధిలు మంచు వారసుని తత్కార్యార్థమై నిల్పెబో 7

తాను పదిరోజులకు పరంధామమునకు
పోవ సమకట్టి ఆచార్యదేవుడెలమి
తనదు నర్ధాంగలక్ష్మి మా తల్లియైన
బాలమాంబతో నీరీతి పలికిరంట 8

శ్రీకంఠెన్ మునుముందు పూరుషుడు వర్ణింపదగున్ దేహమున్
లేకున్నన్ పటు దుర్దశానుభవ మాశ్లేషించు కానన్ సతీ!
నాకున్నెమ్మి యనుజ్ఞనిచ్చి తొలుతన్ పంపింపుమా వేగ, శ్రీ
వైకుంఠంబున కేగి నీకదనునన్ పంపింతు నాహ్వానమున్

అనినన్ కన్నుల నీరునించి, యనఘా! అన్యాయ్య మీరీతిగా
ననగా పాడియె? భర్తకంటె మునుముందర్ధాంగి పుణ్యాంగ నా
ఘనశోభన్ గడతేర గా దొకొ? యశః కల్యాణదీక్షన్ సువా
సిను లర్పించి నివాళులెత్తి మహితాశీరక్షతల్ చల్లగన్ 1

పసుపు కుంకుమముల పదముల పారాణి
తనరు బొట్టు మెడను తాళిబొట్టు
విరులు తలను దాల్చి సరిక్రొత్త వధువుగా
దాటిపోవు స్త్రీలు ధన్యురాండ్రు 11

ధరణి సతీప్రశస్తమగు ధర్మ వెఱుంగరో? భర్తృహీనయా
పరమ పతివ్రతాభరణ పావనశీలనెయైన ఘోరదు
ర్భర పదబంధనాప్తి విధవాత్వము కట్టగబెట్టి మోము చూ
డరు శుభమున్ దలంపరుకటా! యిదియెచ్చటి పాపకర్మమో? 12

భర్తలేనిసతికి బ్రతుకు వ్యర్థంబగు
హరివిహీన పుణ్యయజ్ఞమట్లు
మగువలేనియట్టి మగవారికిదారి
దైన్యముండబోదు ధరణియందు. 13

పతిహస్తాబ్జతలంబె క్రొవ్విరుల తల్పంబై, తదీయాజ్ఞయే
క్షితి శూన్యప్రమదైక ముక్తిరమణీ సామ్రాజ్యవాసంబుగా
ధృతి ముందేగు కులాంగనా తతికి ప్రాప్తించున్ గదా! సర్వ స
న్నుత నీరాజన మంగళాక్షర సుఖోన్ముద్రాతి భద్రావళుల్. 14

ఏబదియేండ్లనాడు మనయిద్దరి పెండిలియైనదాది గా
రాబము తోడుతన్ విధివిరామ మెఱుంగక కూడియాడి నా
మీ బువి, కష్టనష్టముల నీడ్చితి మొక్కటిగా కుటుంబ మెం
తే బరువైనబండి భరియించిన యెద్దుల జంట పోలికన్. 15

పిల్ల లెల్ల పెఱిగి పెద్దవారైనారు
బరువు బాధ్యతలను పంచుకొనిరి
కాన నేనుగూడ కదలెదమీతోడ
నన్ను విడిచి చనగ న్యాయ్యమగునె? 16

అని గగ్గోలుగనేడ్చె మా జనని, ఆప్యాయంబుగా సద్గురుం
డనె "నోమానిని! సర్వముందెలిసి నీవజ్ఞాన పుంజికటిన్
చనుసామాన్య గృహస్థులట్లు పలుకన్ భావ్యంబె? యజ్ఞాగ్నికి
లను పోల్పందగు నిన్ను కల్మషపుజాలంబంటి బాధించునే? 17

తమిమీరన్ మనమొక్కసారిగా పరంధామమ్ము చేరంగ న
ధ్వము గోల్పోయిన బాటసారులగతిన్ భావప్రభాహీన కా
వ్యముఖంగిన్ తెఱువొందులేక రసలుప్త వ్యాపృతిన్ దుర్దశా
తిమిరాంభోధి నిమగ్నచిత్తులయి ఆర్తిన్ బిడ్డలల్లాడరే? 18

కన్నులు చూపుతగ్గి మరి కాళ్ళబలంబడి వార్ధకంబుపై
కొన్నను మంచమందుబడి కుత్సగతిన్ మలమూత్ర సంగతిన్
విన్ననబాటుతో నరకవేదన బొందుటకన్న కాలు చే
యున్నపుడే ప్రయాణమగుటొప్పదె? ముక్తినివాస భూమికిన్. 19

మగడు గతించిపోయినను, మాలిని భోజన భాజనాదు లం
డగడు పడంగబోక తనయంతటతానుగ వండివార్చుకో
నగు, మగవానికయ్యది ప్రియంబగునే? యొకముద్దకోసమై
వగపడిగాపులుండవలె ప్రాపుగ సంతతి యిండ్లముంగిటన్. 20

వినుము సతీ విచారమును వీడుము సాజము చావు జీవికిన్
జనులకు స్నేహబంధములు స్వాప్నికముల్ నవచంచలాలతల్
జనవిధి యాజ్ఞలేక యొక చీమయుపుట్టదు. చావదొక్కటేన్
మన మరణంబుగాని జననంబును నుండవు చెప్పచేతలన్. 21

కనుల నీరూనవలదు రోదనముతగదు
అచలగతినుండి బిడ్డలనరయవలయు
ననుచు నొప్పించి యామెచే నాజ్ఞవడసి
రేమి యాప్రేమబంధనం బెవ్వ డెఱుగు? 22

దట్టపు శీతవాతహతి తట్టుకొనన్ గడుకష్టమంచులో
తట్టున గోనెపట్టపరదా మొగసాల వసారకడ్డుగా
కట్టదలంచె పుత్రుడదిగాంచి గురుండనె నాల్గునాళ్ళకి
లట్టువలేల? ఆరుబయలన్ శయనింపగ కాలమయ్యెడిన్. 23

సీతువు మెండుకాదొడగె చెల్లదు వేదికపై శయింపగా
బ్రాతిగ నింటిలోపలనె ప్రక్కనమర్చెద రండటంచు సం
ప్రీతిగ నాత్మజాత తను పిల్వగురుండనె రెండుమూడు నా
ళ్ళితరి వోవగా బయటి కేగక తప్పదు లోనికేటికిన్. 24

ఎప్పటినుండి భాస్కరునకీ విధి నర్ఘ్య మొసంగుచుంటిరో
యిప్పుడుమాననేలయని యెంతయు తత్సుతబాధనందగా
నప్పుడు దేశికుండనియె నక్కరలేదిక రెండు మూడు నా
ళ్ళప్పరికింప సూర్యునకు నొప్పమికల్గునె ? అప్పతీరదే ? 25

ఈగతి దేశికప్రవరుడేది వచించిన రెండు భావముల్
మూగ వచించుగాని, తమ మోక్షముజేరు ముహూర్తమెన్నడో
తా గణియించి యుంచుకొనె, ధారుణి భోగవిరక్త భావనుల్
త్యాగవిశుద్ధు లౌ పరమహంస లతీతులుగారె సృష్టికిన్. 26

జనకజాదేవి సద్గుణగణము దీవి
స్వామికాత్మజాత, మదనుజాత, మాదు
పెద్దచెల్లెలు భార్గవీ ప్రియతనూజ
యగు హరిప్రియ కాన్పున కరుగుదెంచె. 27

నెలరోజుల్ జనకాంఘ్రి నీరజములన్సేవించి వర్తించుచున్
దళమౌ తత్కరుణామృ తోర్మికల కాదంబంబుగా నూగి, ని
ర్మల పౌరాణిక సత్కథాశ్రవణ హర్షప్రాప్తిరోజుల్ క్షణం
బులుగా నెట్టెను, మౌనిచెంగటయుగంబుల్ లిప్తలౌటబ్రమా ? 28

తండ్రియటంచు తల్లియని దారసుతాదులటంచు నాదుకో
డండ్రని, బంధుమిత్రులు మిటారులు మన్మలటంచు నప్పసె
ల్లెండ్రని బంధనంబు దృఢలీల బిగించిన మానవుండు తా
గుండగ గానుగెద్దువలెకోరి భ్రమించు భవాబ్ధిపోతమై. 29

నిరుపమమౌ ప్రశాంతి మరణింపదలంచిన బంధుమిత్రులె
వ్వరి దరిజేర్పరాదు, పరివారము చుట్టునుమూగి శోక దు
ర్భరమతి నేడ్వసాగిన తిరంబయి చిత్తము నిల్వనేర్చునే ?
గురుతరవాసనల్ కడు ప్రకోపము చెందవె ? కూలద్రోయవే ? 30

ఒకపరి మాటలాడు తరి నొత్తివచించె గురుండు సత్యరూ
పకముగ తాను నమ్ము పయిభావము, చెప్పినదాని నాచరిం
పక విరమించుటెన్నడును పట్టదువారి చరిత్రలోన నం
దుక తన స్వీయసంతతిని దూరము పంపెను వ్యాజమేర్పడన్. 31

"ఇది సంక్రాంతి సమస్త మానవులకెంతే హర్షవిక్రాంతి, సొం
పొదవన్ బంధుజనంబులెల్ల నొకచో నుండంగ వాంఛింతు రీ
యదనన్, పిల్లలు నల్లుడున్ గనులు కాయల్ గాయ నీకోసమై
యెదురుండెన్నులు చూచుచుండెదరు నీ వేగందగున్ జన్మజా ! 32

అని యానంబున కాత్మజాతను సమాయత్తంబు గావించి, దీ
వనలన్ దన్పుచు సాగనంపుచు "సుతా ! వార్ధక్యమాపైకొనెన్
కనులే మోగనులయ్యె, నాదుతనువా కంపింపగాసాగె, గ్ర
క్కున కర్తవ్యములెల్ల తీర్చి ఋణమీగంగంటి నీ భూమికిన్. 33

కావున నన్నుగూర్చి వినగా తగనట్టి కఠోర వార్త యే
దే వినవచ్చినన్ హృదయమేదగ దుఃఖము చెందబోకు మీ
జీవులు చావునొందక వసించిన పుట్టెడు క్రొత్త వారికిన్
తావు లభించునే? భువి నధర్మ పర్వతము పొంగిపొర్లదే? 34

అంతటివాడు మా జనకు డంతము నొందిన మేము దుఃఖ సం
భ్రాంతుల మైతిమేమి? ప్రతి వత్సరమున్ గొనితెచ్చు శాలువా
లింతకు చాలు, నింక కొననేటికి? అమ్మకు నేత్ర శస్త్ర సం
క్రాంత చికిత్స తొందరగ కాగల రీతిని చూడుమా!" యనెన్. 35

ఆ మాటల్ విని సంచలించి సుత "ఆర్యా! యెన్నడున్ లేని మా
రాముల్ పల్కెద రేదొ భీతి మది సంరంభించె కాళ్ళాడునే
యీ మాటల్ విని యింటికేగుటకు? నేనీనాడు పోకున్నచో
బాముల్ కల్గునె? పండు వాగెడినె? కొంపల్ మున్గిపోనేర్చునే? 36

అని కనుగ్రంత లశ్రుసలిలాబ్ధులుగా, కడుపంత నొంద క
న్గొని నగి "పిచ్చిదాన! యిటు కొందల మందగనేల? వార్ధ కం
బును గడువంగ రాదనుచు పోలిన మాటల నంటి, నింతటన్
పొనరునె మృత్యు?" వంచు గురుపుంగవు డామెను పంపె
నెమ్మదిన్. 37

ఎనయన్ ముక్తి పదంబు జేరు దినమందేదో మహానంద బం
ధనతన్ బొంగుచు, తోడబుట్టువుల యొద్దం జేరి, "సర్వేశ్వరుం
గని, యీనాడు ప్రపత్తి చేసితిని లోకంబందు వాసింప జా
లను గొంపొమ్మని నేడొ-రేపొ యది సంలబ్ధంబగున్ చెప్పెరన్."38

అని వచియించెను దేశికు
డను మోదింపకయ వార "లన్నా ! మీకీ
గుణవేల కలిగె ? మిమ్ముం
గని తండ్రిని గన్న తృప్తిగనమే ?" యనగన్. 39

ఇరువురు తోడబుట్టువుల కీ గుడి కట్టిన నాటి ముచ్చటల్
వరుస గతింప నీక ప్రతి వత్సర ముత్సవమున్ పొనర్చు తీ
రరుదుగ తెల్పి, గ్రంథగతమై తగు గాథలు త్రవ్విపోసి వ
చ్చిరి రవి యస్తమింప నిలుసేరగ, మూగెను చిమ్మ చీకటుల్. 40

తేటగు నీట స్నానమును తీరిచి యన్నిట నన్నపూర్ణకున్
సాటియనంగ చెల్లు గుణసాగర మా జనయిత్రి చేతి సా
పా టొనరించిరంట కడుపారగ, తృప్తిగ నయ్యయోధ్యయం
దేటికి యిట్టి వంట లభియించునో ? లేదో ? యటన్న భావనన్. 41

పిమ్మట ముని మనుమనిగని
సమ్మదమున ముద్దుచేసి చాలును దైవం
బిమ్మగ నా మొఱ విని వం
శమ్మును కాపాడె ననుచు సంతృప్తి గొనెన్. 42

మా తమ్ముడు జనార్దనుం బిలిచి "సామాన్యుండు కాశ్మీరునన్
'శీతాకాలము' నందు నేవిధముగా జీవించునో పాప మీ
భూతవ్రాతము లేమి హేతువుగ సంభూతంబులౌ ఘోర బా
ధా తాపోష్మహతిన్ నశించెదరు లేదా ! దీని కంతంబిలన్ ?" 43

అనిమది చింతజెందిరి, మహాత్ములకారణ బంధులంచు ప్రా
మినుకులు తెల్పు నిందుకెసుమీ! యని తమ్ముడు మోదమంది, యీ
యనఘుని గర్భవాసమునయందు జనించిన మేము ధన్యజీ
వనుల మటంచు చిత్తమున భావనచేసి వచించెనీగతిన్. 44

"పాటిలు పేదసాద కలవాటగు నచ్చటి జీవితంబె యే
పాటిదరిద్రుడైన నొకపాటిది మెత్తనియున్నిశాటిపై
నీటుగ తాల్చియుండు, నవనీస్థలి నెంతటి చెట్టుకంతగా
లోటు జగత్పరిస్థితుల కొప్పి చరించునుగాదె భూతముల్". 45

అని ప్రాపంచిక జీవవృత్త విషయ వ్యాసంగచర్చా వినో
ద నిబద్ధస్థితి కొంతసేపు శ్రుతిసేవ్యంబైన ధర్మప్రసం
గ నిరూఢిన్ మరికొంతసేపు సమయాక్రాంతంబు గావించి యొ
య్యన నిద్రా వినివిష్టమానసత శయ్యం జేరి రాలోచనన్. 46

క్షణకాలం బటులేగె, మాయనుజుడున్ శాంతంబుగా నిద్రలో
మునిగెన్, లోకము లంధకార జలధిప్రోద్భూత వీచీఘటా
జని తాందోళిత బుద్బుద ప్రకరమై సంధించె, దేవాళి కా
ర్చిన కన్నీరన మంచుదట్టముగ వర్షించెన్ నభోవీధులన్. 47

ఏదో వీడని బాధ గుండియలయందేపారగా సద్గురుం
డా దుర్దా కనుపింపనీక సుతు నొయ్యన్ లేపి "వేగంబ మా
సోదర్యున్ గొనిరమ్ము పొమ్మనగ" నిచ్చో గాఢ నిద్రా సుఖం
బేదన్ బిల్వగనేల యీ నడికిరేయిన్ కార్యముల్ మించునే?" 48

ఇదియన సద్గురుప్రవరు"డేటికి చెప్పితినో యెఱింగి నా
కెదురు వచింపబోక యిదియే తుది యాజ్ఞగపోయిర"మ్మనన్
నొదవలె నా వచస్సు మదినూటిగ నాటిన నొక్క విదూకునన్
గదలె పితృవ్యు పిల్చుటకు గ్రక్కున భ్రాంతపరీత వృత్తుడై.

ఏమరుపాటులేక పతి కెప్పుడ భీప్సితముల్ ఘటించుచున్
మామక మాతృమూర్తి అతిమాత్ర సమీపపు శయ్యనుండు, ను
ద్దామ విసృజ్యమాన పవిదారిత చిత్తము తోడలేచి, "యే
మేమి?"యటంచు తూలిపడెనెంతయు భీతి వినష్టచిత్తయై, 5

మా పినతండ్రి పుత్రులు సమీహిత నిద్ర మునింగియుండ సం
తాపిత మానసుండయి పదంబులు తొట్రిల మా సహోదరుం
డూపున వాకిమంచముల యొద్దకుబోయి యదెల్ల వేదనో
ద్దీపిత వృత్తితెల్పి చనుదెంచె జవంబున తండ్రియొద్దకున్. 5

మా పినతండ్రిగాదిలి కుమారుల రెండవవాడు శీల సం
ప్రాపిత రంగరాజ పెరుమాళ్ళ గురూత్తమునందు భక్తియై
దాపుననుండు నెల్లపుడు తత్పరతన్ గురుదేవు డాదర
శ్రీపరిపూర్ణుడై యతని ప్రీతిగనుంగొనుచుండు స్నిగ్ధతన్. 5

ఆతడు బిట్టులేల్కని యదాటున స్వప్నమునందు విన్న దా
రీతి మనోనుభూతి పచరింప కలంగుచు నొక్క అంగలో
చేతము తల్లడిల్ల దరిసించి గురూత్తమునంటి చూచె తా
నేతటి ప్రాప్తమేరికెది యెవ్వడెఱుంగు ఋణానుబంధముల్. 5

ఆలో మా పినతండ్రి మేలుకొని ఖిత్యాందోళిత స్వాంతుండై
వైళంబచ్చటి కేగుదెంచె కడువిస్పష్టం పుటుచ్చారణన్
"కాలంబైనది, ఈశ్వరాజ్ఞ చనుచున్నా నింక ఈ జన్మబం
ధాలుం జెల్లెనటుంచు సద్గురుడు చేతన్ సన్నచేసెన్ ధృతిన్" 54

అలతన్ చేతిని గుండెపైనిలిపి 'అబ్బా!'యన్న "నేమైన గుం
డెలలో బాధకలంచునే"యనుచు ప్రశ్నించెన్ బిత్రవ్యుండు ని
ర్మల శాంతైక సుధా ప్రసారకరుణా రమ్యేక్షణ శ్రీలు పె
ల్లలరన్ జుట్టును చూచి లేదనుచుహస్తాగ్రంబునన్ దెల్పుచున్. 55

రామా! యంచు వచించెస్వామి, యిక ఫర్వాలేదులెమ్మంచు తా
రామోదించుచునుండగా మరల రామా! యంచు వాక్రుచ్చుచున్
మోమున్ గ్రిందకు వ్రాల్చె సద్గురుడు, ఆమూలంబుగా సర్వబా
ధాముక్తిన్ స్తిమితత్వముం బడసె నాచార్యుండటుంచెంచగన్. 56

తలపోతల్ తరిలేని మాజనని తత్కాయంబుచేనంటి, అ
గ్గలమౌవేదన పిచ్చికేకనిడి దుఃఖ ప్రాశిత స్వాంతయై
యిలపైవ్రాలెను వృంతసంచ్యుత ఫలాయిత్తంబుగా చుట్టుప
క్కలవారల్లన చేరవచ్చిరి వ్యధాక్రాంత క్రియాశూన్యులై. 57

మా తమ్ముండును, రంగరాజు గురునిం బర్యంకముంబాపి, భూ
మీ తల్పంబున చేర్పనోష్ఠముల నుస్మేషించి యాచార్యు దూ
ర్ధ్వవీతంబుగ ప్రాణపంచక మనంతాకాశముం జేర్ప, దృ
గ్జాతం బశ్రు జలార్ణవ స్ఫురణరేఖా మాత్ర చిత్రాకృతిన్. 58

పరివేష్టించిరి చుట్టునున్ సకల బంధుల్ వ్యథాపూర్ణ దు
ర్భర రావంబులు భూదిశాంతరనభః పర్యంత సంవ్యాప్తమై
పరగెన్, రాలెడు మంచుతుంపురుగముల్ వ్యాజంబుగానేడ్చెదు
స్తరతన్ శోషిలె సృష్టి నా ప్రకృతి నిశ్చాంచల్యమై చేడ్పడెన్. 5

అనువుగ శుక్లనామక మహాబ్దము నందున పుష్యమాసమున్
పొనరిన పుష్యమీతిథిని. పున్నమిరేయి ద్వితీయయామమం
దనుమతి కుండలిన్ పయికి నల్లనలేపి సమస్త బంధముల్
చన, వెస శ్రీనివాసగురుచంద్రుడు మోక్షముచెందె వేడుకన్. 6

వరలు క్రీస్తుశకము గురువాసరమున
పదియు తొమ్మిది నూర్లతొంబదగునేట
పదునొకండవతేది, 'జన్వరి' గురుండు
డెబ్బదొకటవ వత్సరం బబ్బ వెడలె. 6

గురువని తండ్రియంచు నతికోవిదుడంచును భర్తయంచు వి
స్తరమగు గౌరవాదర విచక్షణులై యెవరెంతకొల్చినన్
మరణము సంభవించుతరి, మాన్పగజాలుదురే? ధరన్ బున
శ్చరణములేదు కాలునకు శాశ్వతబంధములేదు జీవికిన్. 62

జాలునపడ్డ తైల కణజాలము చాడ్పున, శుష్కకాననా
ఖిల ధవాగ్ని చందమున విశ్వగురూత్తము మోక్షరాజ్య యా
త్రాలపితైక వార్తత్వరితంబుగ పర్విడె భాస్కరోదయ
శ్రీలు జగత్తునిండకయు, రెక్కలు వచ్చిన తీరుతోపగన్. 63

సరవి గురు చంద్రుడు సుతుడు కృష్ణప్రసాదు
కలుగుటను తంతివార్త వేగంబచేరి
యొక్కసారిగ దివిసీమ నొరసి భగ్గు
మనుచు వ్యాపించె ఘోర దావానలముగ. 64

ఏ విధి నున్నవార లటులే పయనంబయి యాన సాధనా
లేవి లభింపకున్న తుది నీ మహనీయుని దర్శనంబు ప్రా
ప్తావహమౌనో ? లేదో ? యను నాతురత పెల్లుగ పాదచారులై
వావిరి పూడివాడకును వచ్చిరి శోక పరీత చిత్తులై. 65

ఎట్టుల ఈ విషాదయుత వృత్తము ప్రాకెనో, యేమొగాని, ఇ
క్కట్టుల నెంచబోక కరకంజములన్ ముకుళించి వచ్చుచున్
కట్టడి దుష్టదైవమును కార్కొని తిట్టుచు, నిట్టి సద్గురున్
పట్టుకుపోవ చేతులెటు వచ్చెనో ? యంచు వచించి రెల్లరున్. 66

పూదండల్ గొనివచ్చి దేశిక పదాంభోజంబులం దుంచి, ని
ష్ఖేదస్వచ్ఛము, మందహాస రుచిర స్నిగ్ధంబు, బ్రహ్మైక్యతే
జోదర్పంబు, దయామరందలహరీ శుద్ధాంత, మానంద ధా
రా దివ్యంబగు తన్ముఖంబు తనివారం గాంచి ర బంబుగన్. 67

కరములు దోయిలించి, కన్నుగంతల నశ్రుజలంబు నించి, వా
విరి కడసారి భక్తిమెయి విశ్వగురూత్తము దివ్యదేహమున్
దరిసి ప్రదక్షిణించి, బలితంబుగ పీడ్కొని నిల్చిరంత, త
చ్చరమ విశిష్ట యాత్ర కొనసాగగ చూచితరించు కోరికన్. 68

ఊరన్ వంట యొనర్చినట్టి గృహ మొక్కొండైన లేదెందు, నె
వ్వారున్ తల్వరు స్నానపానములు, ఆబాలగోపాల మా
ధారం బేదినమాడ్కి డీలువడ చింతన్ వేణుగోపాలు డా
హారం బించక పస్తు పండుకొనె దేవాగారమం దొంటిగన్. 69

స్వామి శరీరమున్ పరమ భక్తిని 'ట్రాక్టరు' పైని నుంచి, "శ్రీ
రామ! అయోధ్యరామ! రిపురాజివిరామ! రణాగ్రభీమ! సీ
తా మహిళాభిరామ!" యని తత్పరతన్ భజనల్ చెలంగ ను
ద్దామ విచారతన్ చరమ యాత్ర రహించె శ్మశాన సీమకున్. 70

పురవీథుల్ విరివాన జల్లుల జడిన్ పొల్పొందె; మయూర శ్రీ
హరి యూరేగిన తేవ స్త్రీలు కడు శ్రద్ధాభక్తి నర్పించి, య
క్షర నీరాజనరాజి నెత్త, గురురాకన్ ముందుగా తెల్వ భా
స్కరు డుత్సాహత చేరబోయె కడు వేగన్ విష్ణు సామీప్యమున్. 71

అరుదై దేశికవర్యు నగ్రతనయుం డత్యంత దౌర్భాగ్య ని
ష్ఠుర పాశాన్విత బద్ధుడై కటకటా! చూపందు భాగ్యంబు రూ
పర రాజాలకపోవ రెండవ సుతుం డయ్యగ్ని సంస్కార కా
ర్య రయోద్విగ్నత నెంచి తచ్చితికి నిప్పంటించెన్
గృతస్నాతుడై. 72

పాపుల రోగపూరితుల వ్యర్థ చరిత్రుల నెంతమందినో
రేపును మాపు దగ్ధ మొనరించుచు కల్మషపూర్ణుడై మహా
తాపవిశీర్ణుడై యిపుడు తత్కలుషంబును బాయ నగ్ని తా
నేపును తీపుదోప దహియించెను శ్రీగురు దివ్యదేహమున్. 73

ప్రతిదిన మర్ఘ్య మిచ్చు గురుపర్యుఁడు కానగరాడటన్న, హ్రా
ద్గతమగు బాధ ద్రుంచె రవి, గాఢతమంబు జగంబు ర్మింగె, దు
స్థితిగొని పద్మినీ రమణి చేడ్వడె, ప్రాణితతుల్ జడత్వ సం
గతి నిదురించె దేశిక శిఖామణి నెమ్మది యస్తమించినన్. 74

ఏ దౌర్భాగ్యపు కోడి కూసినదియో, యీనాడు మున్ముందు మా
కి దృగ్వేదన శాశ్వతానుభవమయ్యెన్ ఘోర దావాగ్నియై
స్వాదు జ్ఞాన వితీర్ణశీలు గొనిపోవన్ నేర్తువేగాని నీ
వేదీ యిట్టి మహాత్ము నొండొకరునిన్ సృష్టింతువా? దుర్విధీ! 75

స్వామీ! దేశిక సార్వభౌమ! యుపదేశ స్ఫూర్తి శాసించి తీ
వా మార్గంబున నుద్యమించి యతిలోకాదర్శ కర్తవ్య దీ
క్షా మాహాత్మ్యము చాటి చెప్పెదము జ్యోత్స్నా శీత సంపన్న వీ
క్షా మాధుర్యము మాపయింబరపవే! సంప్రీతి దీవింపవే! 76

# తపస్సిద్ధి

## జీవితఖండము

అదియొక పల్లె, యెయ్యెడల నారసినన్ జెను తాడితోపులున్
పొదలును తుమ్మ లీదులును పొంగి స్రవించెడు పంటకాల్వ లిం
పొదవెడు పైరుపచ్చలు మహోన్నత భూజసమాజ ముఖ్య సం
పదలకు నాలవాలమయి వాసి గడించెను పూడివాడ నాన్.

గతమందెన్నడొ వారి రాశి యిటదాకన్ వ్యాప్తమై యుండగా
చ్యుతమై యోడ యొకండు పూడెనట నిచ్చో నీట నద్దాన స
మ్మతి నీయూరికి పూడివాడ యను నామంబబ్బె నానొక్క సం
శ్రుతమౌ గాథ జనశ్రుతిన్ బ్రచురమై విన్పించు నీమోసలన్.

వంద యేండ్లకు ముందటివఱకు తదవ
శేషములు గన్న వృద్ధులు చెప్పిరనెడు
కథకు రెక్కలు మొలిచి జగత్తు నిండె
కావ్యగతమౌచు పండె నా కలము సోకి.

ఇట్టి గాథలు వినువీధి నెగురుచుండు
తలయు తోకయు నొక్కింత కలుగకుండు
కాని విన నింపు సొంపు సంఘటిల జేయు
కథలు సృష్టింప మనవారు ఘనులుకారె?

అన్ని కులాలవారు నిసుమంత విభేదము లెన్నబోక తా
రన్నలు తమ్ములట్టు లోకపై చరియింతురు కష్టసౌఖ్యముల్
క్రన్నన నందఱున్ కలిసికట్టుగ పొందుదు రింతకన్న వే
రున్నదె స్వర్గమంచు ప్రమదోన్నత భావపరీత చిత్తులై. 5

గ్రామము మధ్యభాగమున కాలువయొండు స్రవించుచుండు, ను
ద్దామత రెండువైపులను తత్తటముల్ స్పృశియించుచున్ గృహా
రామము లేర్పడెన్, కనుక గ్రామము నాలుగుమైళ్ళదాక రే
ఖా మహితంబుగా పెరిగి కన్పడు పెద్దపురంబు పోలికన్. 6

బరువైయూథము లుర్వి క్రేలగ సజీవక్షీర వారాసులై
కరమున్ మందలు మందలై తిరుగుచున్గన్ పండువుంజేయు న
ప్పుర మందావులు గేదెలున్ పసిరికల్ పొల్పారగా మేసి ద
గ్గరలో కాల్వలనీరు త్రావియట వృక్షచ్ఛాయలన్ పండుచున్. 7

కలకల వేగు ముందె గృహకాంతలు మేల్కని యింటిముంగిటన్
లలికలయంపి చల్లి మృదునాదము కవ్వము వెంటనంటి గా
జుల కలరావ మాధురుల చూరగొనన్ వెసచల్ల చిలుక పే
శల కసులున్నదానికి ఫలంబగు పల్లెల సొంపుచూడగన్. 8

అంబేయంచు మనోజ్ఞరావములతో నల్లారు ముద్దార వ
త్సంబుల్ గంతులు వైవ పల్లెపడుచుల్ ధారాళమౌ ధారలన్
చెంబుల్ నిండగ పాలుపిండుకొని విచ్చేయంగ పాలేర్లు వై
శంబున్ పొల్పులువిప్పి పచ్చికబయళ్ళంద్రోలు సొంపేమనన్ ? 9

ఈ జగతీత్రయం బరయనే నది యున్కి పవిత్ర తాప్తికిన్
భాజనమయ్యెనో? కఠిన పాప కలాప విలాపులే స్రవం
తీ జలమగ్నతన్ పరమదివ్యత కాంతురో? అట్టిగంగ, సం
పూజిత వార్ధిసంగ కడుపొల్చును కాపుల తోడబుట్టువై. 10

మాపురము శ్రీపురంధ్రికి
కాపురమగు, కలుగుదాన కడుగుప్తముగా
కాపురములు సాగింతురు
కాపులు గుణగణ్యులగుచు గౌరవరీతిన్. 11

ఆకాపులందు వెలసిరి
ప్రాకటవిఖ్యాత దివ్యవైభవ చరిత
శ్రీకులయి మొవ్వవారలు
తేకువ శ్రీ పైడిపాల ధృతగోత్రజులై. 12

వేదవేదాంగాది విద్యాప్రశస్తసం
పూర్ణధీసారులు మొవ్వవారు
శ్రీరామ పాద రాజీవ పూజానిత్య
మోదవిస్తారులు మొవ్వవారు
భూనభః పర్యంత భూషిత సద్యశో
మూర్తి సంభావితుల్ మొవ్వవారు
ఆధ్యాత్మిక జ్ఞాన హర్షవర్ధన శిష్య
పోషణాధారులు మొవ్వవారు

పేదసాదుల దరిజేర్చి ఆదరించి
భూరి సంతృప్తి గూర్తురు మొవ్వవారు
సతత కల్యాణ సత్క్రియా చతురమతులు
పూజ్యశీల విచక్షణుల్ మొవ్వవారు. 13

ఆ మొవ్వ వంశమునకున్
దా మూల పురుషుడగుచుముదంబును గూర్చున్
ధీమాన్యుడు సూరయ్య ప్ర
జా మర్యాదలను పొంది చతురగుణుండై. 14

ఎఱిగిన యంతకున్ భువి నహీన యశంబుగడించి యూరికిన్
శరమితడే యనంగ వరణీయ శుభంబులు కూర్చి కామితో
త్కరములు పంచి పెత్తనపు దారన నెంతయు నొప్పు సూరయా
క్షర వరనామధారి సరసంబుగ మొవ్వకులాబ్ధిసోముడై. 15

బాల శశాంకమౌళికి వివర్ధిత విశ్వశుభైక శీలికిం
బాళి వినాయకుండును కుమారుడు పుట్టినజాడ, సత్క్రియా
పాళికి పట్టుగొమ్మ భగవానుడు, మాన్యుడు బాలచంద్రుడున్
శీలజనించి సూరయకు నిర్మలకీర్తిని పెంచిరర్మిలిన్. 16

అందున బాలచంద్రుడు మహాసుగుణాంచిత కర్మశీలుడై
పొందెను పేరు పెంపు, క్రతుభుగ్గణనాథుడు నిర్జరేశ్వరుం
డందము మీరుపేరగు జయంతుని గాంచిన రీతి రామయన్
సుందర హృద్వసంతు గుణశుద్ధు సుతుంగనె ధీప్రసిద్ధునిన్. 17

రామయ - కాళ పారద మరాళపటీర సుధాబ్జ మల్లికా
ధామ యశోవిహారుడు ముదంబున జానకిరామయన్ గనెం
బ్రేమ కుబేరదిక్పతి తమిన్నలకూబర సుందరుంబలెన్
భూమి జనంబులెల్ల తగుపుత్రుని పొందితివంచు పల్కగన్.

జానకి రామయాఖ్యుడు ప్రశాంత విశుద్ధ విశిష్ట శీలసం
ధానను బాపమాంబను ముదంబున పెండిలియాడి పుత్ర సం
తానము నల్వురన్‌బడసె ధర్మవితీర్ణుని ముత్తయన్ సుధీ
త్రాణుని లక్ష్మయన్ సుగుణధాముని రామయ, నెమ్మికృష్ణయన్.

అందున కృష్ణయాఖ్యుడు మహావిభవంబున దివ్యభావనా
సుందర శీలవందిత విశుద్ధ చరిత్రను కృష్ణమాంబ నా
నంద వశంవదుండయి జనస్తుతి పెండిలియాడి బంధుస
ద్బృందము మేలుమేలన గ్రహించె ప్రశస్తగృహస్థ ధర్మమున్.

ధరపయి ధర్మసార మవతారము చెందెనొ? లేక ప్రాగ్దిశా
తరుణి జలేజ బాంధవుని తాగసెనో? యన కృష్ణయాహ్వ దా
దరమున కృష్ణమాంబ నిజధర్మ సతీమణిగా ప్రభావిభా
విరళ యశస్తపోధనుని వేంకటదాస మహాత్మునింగనెన్.

వేంకటదాసమౌని ప్రభవించిన యేడవనాటి రాత్రి ని
శ్శంకత, జ్ఞానమండనుడు సర్వకులాబ్ధి విధుండు విష్ణుప
ర్యంకు డనంతుడంచిత ఫణావళిపట్టెను తచ్ఛిరంబుపై
నంకిలిలేక సర్వజను లద్భుతసాగర మగ్నులై కనన్.

పదియు రెండేండ్ల వయసు పైబడిన సమయ
మం దుపాస్య దైవము రాక్షసాంతకుండు
జలజనాభుండు తలను సాక్షాత్కరించి
వ్రాసె బీజాక్షరములు తద్రసనపైని. 22

అప్పటినుండి భక్తిరస మాకృతి పొందిన రీతి రాత్రులం
దప్పురి నీడు జోడుగల యట్టి రసజ్ఞులచేర్చి యొక్కచో
నొప్పెడు, భక్తిరూపభజనోత్సవ కార్యకలాపుడై
యెప్పుడు శ్రీరమారమణ హృద్యకథా మృదుగానలోలుడై. 23

ఆయన తండ్రి ధర్మమయుడైన ఖాతరు సేయబోవడీ
ప్రాయపు భక్తిభావవరి వస్యత; మాయ గ్రసించె నేదియో
స్వీయ తనూజునంచు నతి విస్తృత భీతి విచారనిష్ఠుడై
పాయుము తత్పథంబనుచు బాధల పెల్లుగ ముంచె నాత్మజున్. 24

ఆ ప్రహ్లాదు హిరణ్యకశ్యపుడు దైత్యస్వామి యేరీతి చిం
తా ప్రస్తారు నొనర్చెనో, అతుల నిత్యప్రాపితానేక క
ష్ట ప్రారంభు నొనర్చె తండ్రి, యయినన్ సంపూర్ణమౌభక్తి ల
క్ష్మీ ప్రాణేశ్వరు పాదపద్మములు పూజించుచున్
దృఢస్వాంతుడై. 25

మలయన్ భక్తిపథంబు విస్తరిల శ్రీమద్వేణుగోపాలు దే
వళమున్ గట్టగజేసి, శాస్త్ర విధులన్ బాండిత్య మార్జించి శి
ష్యుల పెక్కండ్రను జేర్చి భక్తి భరితౌత్సుక్యంబు కల్పించి, ని
శ్చల భావంబున భాష్యకార సుసమాజంబొండు స్థాపించె తా. 26

పంచ సంస్కార విధుల నిర్భరత సలిపి
మహితరామ షడక్షరీ మంత్రమొసగి
మహిమమున విశిష్టాద్వైత మతమునందు
వేలకొలదిగ జనుల సంప్రీతి జేర్చి. 2

జ్ఞాన సూర్యోదయ గ్రంథంబు నందించె
గోపీ విలాసంబు కుదురుపఱచి
లక్ష్మీ ప్రభావంబు లక్షణంబుగ దెల్పి
కూరేశ విజయ ప్రసార మెన్ని
భువి భాగవతసుర భూజమ్ము వెసదించి
హరికథల్ శతసంఖ్య నలవరించి
ఉడయవరులె యిట్టులుదయించి వైష్ణవ
వ్యాప్తిని ఘటియించి రనుచు ప్రజలు

నుతులు కావింప సద్యశశ్చతురు లగుచు
భారత ప్రవచనకాల పటుముహూర్త
మందు మోక్ష సామ్రాజ్యమ్ము నందె ప్రీతి
తలప బ్రహ్మర్షి వెంకటదాస మౌని. 28

యౌవనమందు సద్గుణగణాంచిత శీల, ప్రతివ్రతా శిరో
భావిత రత్నభూషయగు భవ్య చరిత్రను రాధమాంబ నా
ప్లావిత మోదసారత వివాహము చేసికొనెన్ రఘూత్తముం
డా వసుధాతనూజను ప్రియంబున పెండిలియాడి నట్లుగన్. 29

శ్రీరాముండును లక్ష్మణుండు భరతశ్రేష్ఠుండు శత్రుఘ్నులే
తీరై పంక్తిరథాత్మజాతులుగ పృథ్విం బుట్టిరో, అట్లదే
దారిన్ వేంకటదాసవర్యునకు రాధాదేవి గర్భంబునన్
ధీరాసుల్ తనయుల్ జనించిరి ప్రసిద్ధిన్ నల్వురుద్యన్మతుల్. 30

అందున నగ్రజుండు ప్రియమారగ దివ్యగుణానుషంగుడై
పొందిక సర్వవిద్యలను పుక్కిటబట్టెను తద్విశిష్ట సం
స్పందుడు శ్రీనివాస పెరుమాళ్ళు గురూత్తము డార్ద్రితా, సుధీ
స్యందనుడై విహారముల సల్పెను వేదవిధేయ వీధులన్. 31

సతతంబు వేదాంత సాగరోన్మథన మే
ధామంథ లబ్ధ విస్తారయశుడు
పౌరాణిక వరుండు పరమభాగవతుండు
వేంకటాచలపతి విధివహుండు
పాండిత్యవారాశి పటు కవితారాశి
మహితభక్తి తపస్వి మధువచస్వి
శిష్యవత్సలుడు ప్రసిద్ధుండు వేదవి
దుడు దాశరథి సూరి కడుయశస్వి

రామపూజా పరాయణ ప్రముదితుండు
మృదుహృదయశీల విజ్ఞానమేదురుండు
ఘనుడు రామప్రసాదన క్రమత రెండు
మూడు నాల్గు సంఖ్యాకులౌ పుత్రులరయ. 32

వారల కనుజాతలు వి
స్తారగుణోదారశీల తత్పరభావ
శ్రీరమ్య లుద్భవించిరి
హీరక్షీరప్రకీర్తి నిరువురు ముదితల్.

పరమ కల్యాణభావనా భవ్యశీల
రామబాణమ్మ పతిపాదరమ్య జీవ
స్త్రీలకెల్లను మేల్బంతి శీలనిరత
సౌమ్యగుణ కమలాదేవి సాధుచరిత.

విరి జనించినంత పరిమళించినరీతి
శ్రీనివాసగురుడు చిన్ననాడె
అనతికాలమందె ఆంధ్రసాహిత్యాన
నద్భుత ప్రభావమంది మెఱసె.

జనకునియొద్ద సంస్కృతము చక్కగ నధ్యయనంబొనర్చి, సొం
పున ఘనశాస్త్రపాండితిని పొందదలంచి శ్రమింపజూచి నం
తన సిరిపూడి గ్రామమున తర్కమునందతి లోకపాండితీ
చణుడగు కృష్ణశాస్త్రిగని సర్వసపర్యల వారి దేర్చుచున్.

అరిమురి తర్కశాస్త్రమును నధ్యయనం బొనరింపబూనె, త
త్పురములు రెంటికిన్ నడుమపొల్చు నొకండగు ముర్గుకాల్వ,
స్తరమగు వానకారునను దాని తరింపగ, మా పితామహుం
డరు దగు భీతిచెంది చదువాపు మటంచును హెచ్చరించినన్.

ఎదియేమైనను తర్కశాస్త్ర విషయం బెకాగ్రతామూల చూ
డ దృఢస్ఫూర్తి పఠింపగా దలచి నిష్ఠాప్రేష్ఠుడై యాతనే
ర్చి దినం బొక్కటి తప్పకుండ చని పేర్చెన్ తర్కశాస్త్రద్యుతిన్
చదువుల్ రావె శ్రమైక తత్పరులకున్ సమ్యక్సమీచీనతన్. 38

పదియునునాల్గు వర్షముల ప్రాయమునందునె శ్రీనివాస ధీ
మధితు పురాణముంజదువ మాదు పితామహు డుత్సహించి నె
మ్మదిగొనిపోయె చావలికి మంజుల భావగభీర పద్ధతిన్
జదివెడు తీరుగాంచి జనసంఘము ముక్కున వ్రేలు మోపగన్. 39

వ్యవసాయంబు ప్రధానవృత్తి, యదెజీవం బందుచే తత్క్రియా
సవనక్షేత్రపు యాజకత్వమునకై సంప్రేషితుండై మహో
త్సవలీలన్ గడుకొద్దినాళ్ళకె రహస్యంబుల్ గ్రహించెన్ స్వకీ
య విశేషోత్కట కార్యనిర్వహణ సమ్యక్పూర్ణ సామర్థ్యమున్. 40

నారుంజల్లిన నాటినుండి కలుపున్బాటించి తీయించు దా
కారా! కోతల నుండి నూర్పిడుల కార్యంబెల్ల నొక్కొండుగా
నారుంగాలము నుద్యమించి ఫలసాయం బుత్కటప్రాప్తిగా
మీరన్ దీక్షవహించె పట్టుదలసుమ్మీ! ఆదిసోపానమౌ. 41

హలముంబట్టెను బండిత్రోలె మడకల్ హత్తింపె నార్పికె కు
ప్పలుకొట్టెన్ మరమత్తుచేసె పొలమున్ పాతర్లుతీసెన్ పురుల్
వెలయంగట్టెను గడ్డివాముల గముల్వేసెన్ వివెచించి ని
చ్చలు నీయా పని నాగ నేటికి సమస్త ప్రక్రియల్ తీర్చెబో. 42

ఉదయంబాది పొలంబులో వివిధ కార్యోన్మగ్నతన్ బీరుచెం
డ దళంబైన సహించినిల్చి తుది సంధ్యారాగ రక్తప్రభా
మృదులాంశు ప్రకరోర్మి సంపదలతో నిర్జేరి జ్ఞానార్జనా
స్పదుడై యర్ధమరేయిదాక చదువున్ సాగించు నుద్యన్మతిన్. 4

తరమిడి పంటకాల్వలను త్రవ్వగజేసి ధనంబు రైతులం
దరికడ ప్రోగుచేసి యిడ తత్పరతన్ 'ప్రతిరైతు' చుట్టునుం
దిరిగిన దృశ్య మిప్పటికి నేత్రయుగంబున దోచు కార్యముల్
నెఱి నెరవేర్చుదాకను గణింపరు నిద్ర, తలంపరన్నమున్. 4

వర్షాకాలము తండ్రితో నెచటనో భక్తిన్ బురాణంబు తా
హర్షస్ఫూర్తి పఠించు, కొంచెము విరామావాప్తి శాస్త్రాగమా
ద్యార్ష గ్రంథవిశిష్ట పూజ్యవిషయ వ్యాపారమర్థించు సం
తర్షింతున్ పటుసాహితీధృత వివాదగ్రస్త సిద్ధాంతముల్. 45

వయసువచ్చిన సోదరుల్ వరుసగాగ
నలరు పనిపాటులందు సాయంబుచేయ
కలిసికట్టుగ నొకటిగా కార్యములను
నిర్వహించె గురుండు నెంతేముదాన. 46

తెలుగున గల్గు నందములు తేకువ సంస్కృత పంచకావ్యముల్
వలచి స్వశిష్య సంతతికి పాఠముచెప్పుచు, నభ్యసించుచున్
సలలిత రామనామ జపసార విచారము చేయుచుండ ని
ర్మలగతి నూత్నయవ్వనము గ్రమ్మె గురూత్తము నాశ్రయించుచున్ 47

## వివాహము

పద్మాశాలవారు కాపుల
హృద్యసమ్మతులై వసింతురీ గ్రామమునం
దుద్యోతించుచు శుభకా
ర్యోద్యమ నిత్య శ్రమైక యోగ్యాశయులై. 48

అందు వసియించు రామదాసయ్య సౌగ
గుణ గరిష్ఠుండు-యోగ్యు-డక్రూర చరితు
డుద్ధ వాభ్యుదయుండు-గుణోన్నతుండు
భవ్యశీల యశోదమ్మ పత్నికాగ. 49

ఆయమసాధ్వి శీలవతి యందఱకున్ తలలోని నాల్కయై
పాయక పేదసాదలకు పండిన కల్పకమై ప్రజార్చనా
ధ్యేయ విధేయ భర్తృపదధీన మనస్కత సచ్చరిత్ర సం
ధాయినియై యశోదమ యనంత యశోదమ శాంతిచిత్తయౌ. 50

వారికి సుబ్బరావు సుతవర్యుడు పుత్రిక బాలమాంబ నా
వారిజ శుభ్రనేత్ర-మృదుభావిత శుద్ధ చరిత్ర, కన్యకా
వార శిరోవిభూషణము, భాసుర సత్యవచో విధేయ సం
స్కారక సౌమ్యభాషణ-ప్రపూజిత సర్వపతివ్రతాగ్రణియై. 51

మానక శ్రీనివాస పెరుమాళ్ళు గురుండు రఘూద్వహుండు తా
జానకి పెండ్లియాడిన ప్రశస్త విధాన మనోరథాకృతిన్
బూనిన భాగ్యదేవతన పొల్చు వధూమణి బాలమాంబికా
పాణి గ్రహించె మంత్రయుత పావన వహ్నికలాప సాక్షిగన్. 52

పూవును తావి బంగరపు ముద్దయు కాంతి సుశబ్ద మర్థమున్
వావిరి కూడినట్లు పెనవైచెను పద్మభవుండు వీరికి
పావన బంధనం బనుచు బంధులు మిత్రులు సత్కృపారతిన్
దీవన లిచ్చి మెచ్చిరి పదింబదిగా విధి నిర్ణయార్హతన్.

అన్ని విధంబులందు ననువై తగు జంటల కూర్పబోక బ్ర
హ్మన్న విభిన తత్త్వగుణ హారుల స్త్రీ పురుషాళి నొక్కటన్
త్రన్నన కూర్చి దుర్యశము గాంచెను, దానిని మాన్ప నైపుణిం
జెన్నగ వీరిగూర్చెనని యెంచిరి విజ్ఞులు సప్రమాణితన్.

అమరెను ఘుణాక్షరన్యా
యము చేతనె యిట్టి జంట; అది విధి నైపు
ణ్యముచే నైనను నిట్టివి
యమరవె మఱికొన్ని జంట లనిరి విధిజ్ఞుల్.

బ్రహ్మ వర్చస్సుచే రాజిల్లు వదనాన
ఊర్ధ్వ త్రిపుండ్రకం బుబ్బతిల్ల
జ్ఞానగోళ ప్రతీకగ పొల్చు నున్న నౌ
తలను గోష్పదమంత పిలక దనర
భక్తికి గుర్తుగా వర్తిల్లు వెడదయౌ
వక్షాన తులసి తావళము మెఱయ
శ్రీరూప విధికిని, సిగ్గు కూర్చెడు శ్రవ
ణములందు మకరకుండలము లూగ.

హనుమ దష్టాపద పదక మతులితముగ
సవ్య కరమున కరము తేజంబు నింప
పరగు చామన ఛాయ రూపంబుతోడ
శ్రీనివాస గురుండు వర్తించుచుండు. 56

పెద్దదియైన కన్గవ గభీర విశాలము ఫాలభాగమున్
నిద్దములౌ కపోలములు నిక్కి నిటారగునాస, శాంతికిన్
హద్దగు వక్త్రమండలము-నందరి మెప్పుల కాకరంబుగా
దిద్దెను శ్రీనివాస గురుదేవుని రూపము బ్రహ్మ నేర్పునన్. 57

దినచర్య

వేకువ నాల్గు గంటలకె వీడ్కొని సెజ్జను కాలకృత్యముల్
చేకుర తీర్చి మాసదనసీమ పొసంగిన బావినీరు తా
నైకొని చేది పోసికొని, యంతట ధోవతి విళ్ళగోచి తో
తేకువ దాల్చి వైష్ణవము తీర్చిన స్తోత్రములన్ బఠించుచున్. 58

శిరమై విష్ణు సహస్రనామ భగవద్గీతాది శ్రీవైష్ణవా
దరణస్తోత్రములం బఠించి, యటమీదన్ రామషడ్వర్ణ సుం
దర మంత్రంబు జపించి భక్తికలనా ధన్యాత్ముడై బాల భా
స్కర తేజోమయమూర్తి కర్ఘ్యమిడు సంస్కార ప్రభాస్ఫూరుడై. 59

బాళిన్ గోవెలకేగి పూర్ణకరుణా పారీణు శ్రీ వేణుగో
పాలున్ గాన విలోలు గోపవనితా వందారు మందారునిన్
శ్రీలక్ష్మీరమణీ మణిన్ పరమ సంప్రీతిన్ విలోకించి, శౌ
ర్యాలంకార సమీరనందనునకున్ సాష్టాంగ మర్పించియున్. 60

కడు మధ్యాహ్నముదాక నుగ్రతపమున్ గావించి తర్వాతసా
పడి విశ్రాంతిగ నొక్కగంట మృదు తల్పంబందు నిద్రించి, నె
వ్వడి సాహిత్య కవిత్వమర్మ విషయ వ్యాసంగమందుండి, యా
కడ శిష్యాళికి శాస్త్ర పాఠములు వ్యాఖ్యానించి వర్ణించెడున్. 61

తమి సాయం సమయాన పంటపొలముల్ దర్శింప విచ్చేసి మొ
త్తము చేలన్నియు చుట్టుముట్టి దివసాంతశ్రీలు సంధ్యా సతీ
సముఖంబందున నెఱ్ఱడాలు వెలుగుల్ సంధింప వెన్వెంట సం
భ్రమతన్ గొందఱు కొల్చిరా గృహము చేరన్వచ్చు
ముచ్చట్లతో. 62

ఆవిధి వచ్చుచున్ భగవదాలయ సీమను జేరి లోక వా
ర్తా విషయైక తత్పరధురాధరులై చెలరేగు వారికిన్
పావన విష్ణుగాథల ప్రభావము తెల్పదలంచి మేఘ గ
ర్జా విభవోపమ ప్రచల రావముతో నెలుగించి రమ్యతన్. 63

ఎంతో తడవు పురాణం
బంతములేకుండ సాగు నఖిల ప్రజలా
ద్యంత సుధారసవీచి ను
ఖింతురు నడిరేయిదాక కిమ్మనకుండన్. 64

ఇది దాదాపుగ నిత్యకృత్యము గురుండింటన్ వసింపన్; శ్రమా
స్పద మార్గంబున జ్ఞానమున్ బడసి యా జ్ఞానంబు లోకంబునన్
పెదజల్లన్ దనకాలమెల్ల ప్రజకై వెచ్చించె, లోగొన్న వా
ర్ధిశదకంబెల్ల నొసంగవే జలదముల్ యోజింప భూతాళికిన్? 65

మాదు గ్రామంబునకు పదిమైళ్ళ దూర
మందు పెద్దవరంబను నగ్రహార
మలరు, నట సముద్రాల వంశాబ్ధి చంద్రు
డుండె లక్ష్మణాచార్యులన్ పండితుండు. 66

అస్మదీయ పితామహుండాయనకడ
చేరి వైష్ణవసిద్ధాంత సారమెఱిగె
పరగ మా పినతండ్రి దాశరధి సూరి
శాస్త్రషట్కము నచటనే చదివినేర్చె. 67

నెఱి మా తండ్రియు లక్ష్మణార్యువలనన్ శ్రీ వైష్ణవాచార ని
ర్భర ధర్మంబులు, తద్విశేషములు శ్రీరామానుజాచార్య భాష్య
రహస్యార్థపు గుట్టుమట్టు లఖిలంబాద్యంత మున్నేర్చె సు
స్థిరతన్ ప్రాక్తనజన్మ విద్యలరుదై సిద్ధింపవే లీలగన్. 68

హరికథలెన్నొ వ్రాసి మధురాంచితరీతుల మా పితామహుం
డరు దుగచెప్పె నెల్లెడల, నాహరియేచనుదెంచి, నా కథా
చరితములిట్టి యద్భుత రస ప్రవణంబులె యంచుసంశయ
స్థిరత గనంగ, ఆయన విధింపగురుండును నేర్చెగానమున్. 69

సంగీత వైదుష్యము :

పోతుమెఱక సుబ్బారాయ పుణ్యగుణుడు
వెలయు సంగీత విద్యా ప్రవీణుడగుచు
అతని సన్నాయిపాట తానాలకింప
వాణి తన్మయురాలయి వరలకున్నె ? 70

అతడు మా యింటికను నిత్యమరుగుదెంచి
పరమ గాంధర్వ విద్యను గురువరునకు
నేర్పిపోవుచునుండె సంతృప్తిగురుడు
ప్రియత మినుముట్టనేర్చ పరిశ్రమించి. 71

అరుదై ఖందుగులింటిలో జరుగు కల్యాణోత్సవోత్సాహ వి
స్తరతన్ 'చెర్వులలంక' గ్రామమున కాచార్యుండు విచ్చేసె సు
స్వర నాగస్వర వాద్యపండితుని నాహ్వానించిరీ "పెండ్లిక
చ్చేరి" కన్ వార్తనెఱింగి పిల్వపనిచెన్ శీఘ్రంబ విద్వాంసునిన్, 72

శంకరాభరణము శంకరాభరణమౌ
దానిపాడుమా! ముదంబునింపు
ననుచుగురుడుకోర. నాతండుఖరహర
ప్రియనుపాడి తమిళకృతినిప్పెసె. 73

తదుపరిని తానుగోరిన దాని పాడు
ననుచు భావించె గురుచంద్రు, డతడు దాని
పాడివిరమించె "శంకరాభరణమిదియే?"
బళిర! గాన విద్యా మహాపరిణతుడవె!" 74

అనుచు గురుదేవుడెకసక్కెమునకు పలుక
"సీతడేమియు నెఱుగ డిదే విధాన
పలుకు చుంద్రు సంగీతము తెలిసినట్లు
పిచ్చివదిలించినాడ, ఈ విధమెలెస్స." 75

అని మనంబున తన తెల్వికిన్ తనంత
మురిసిపోవుచు, నెగతాళిముసురుచుండ
మృదుల దరహాసమున తండిట్టులనియె
"దాని పాడితి మీయాన తలధరించి". 76

"జనకరాగమా? అయ్యది జన్యరాగ
మగునా? యే మేళకర్త? ప్రియంబుమీర
పలుకుమద్ది ఆరోహణ వక్రమగునా?
పరగనది యవరోహణ వక్రమగునా?" 77

అని సంగీతరహస్య సంగతుల నాద్యంతంబు గుప్పించి "న
న్నను మోదింప పిచ్చివాడనని నీ యాంతర్యమందెంచి, వం
చనగావించితె? నీవుతక్క పరులీ శాస్త్రజ్ఞులున్ లేరె? నె
ట్టన గాంధర్వము నీ మొగంబుననె పుట్టంజాలెనే? యోగతిన్. 78

ఖరహరప్రియ రాగంబు క్రమతపాడి
అరవకృతి వేసి శంకరాభరణమనుచు
బేలనొనరింతువే?" యంచు చాల కోప
పరవశుండయి కేకలు వైచె గురుడు 79

చుట్టును నున్నవా "రటులు చూచెదరేటికి, వీని చెట్టుకున్
గట్టుడు, కాటియు శౌడిగట్టునె యిట్టి మహాత్ము మోసపుం
బుట్టలపాలుసేయ? మనబోంటుల నీతడు లెక్కసేయునే?
పట్టు"డటన్నవాడు భయపాండురుడై కడుకంపమొందుచున్. 80

పడియాచార్యుని పాదమంటి "గురుదేవా! తప్పుసైరించి నె
వ్వడి కాపాడుడు, పాడుబుద్ధి తొలిచెన్, వాత్సల్య వారాసులై
కడు దుర్మార్గుల యందుగూడ శుభసంకల్పంబుతో నుంచు రె
య్యెడ నార్యుల్, శరణంటి భారమిక మీదే"యంచు కేల్మోడ్చినన్. 81

కనికరించి యిట్టు లనియె నాచార్యుండు
నిట్టి తప్పుచేయ కెందుముందు
ననుచు మందలించి జనపాళి శాంతింప
జేసె ఘనులు పరుల చెఱుపరెందు. 82

భారతవర్షమెల్ల తన పాటకు ముగ్ధమనోహరంబుగా
పారములేని మోదమున బారులుతీరు, నతండు కీర్తి వి
స్తారుడు, గానసాగరుడు, సౌమ్యచరిత్రుడు పిచ్చుహారి వి
స్పార విశుద్ధనామకుడు వచ్చె గురూత్తము చూచువేడుకన్. 83

ఒకపరి సద్గురుండు సుతసోదర శిష్యకళత్రమిత్ర సం
ప్రకరము తోడ బంధుల వివాహము గూర్చుచనన్ ప్రసిద్ధగా
యకుడగు పిచ్చుహారియు ప్రియంబున వచ్చెను మున్నతండు దే
శికు గురియించి వింత దరిసింపగ వచ్చె విశుద్ధ భావనన్. 84

పరివస్యాకృతిఁ ప్రాంజలించి కుశలప్రశ్నంబులైన తత న
ఠర లోకంబు విలక్షణార్ధదముగా సంధించి తద్గీతమా
ధురి సన్నాయు మనోజ్ఞగానలహరీ ధూర్యంబుగా నిర్మగ్నడై భా
వ రిరంసాధిరతిన్ వెలార్చె గురుడవ్యక్తాను రాగంబునన్. 85

గురుడు తదీయ సోదరులు కోరినవెల్ల నతండుశుద్ధ సుం
దరగతి పాడుచుండ మృదునాద తరంగము లీధరానభో
వరణము నాక్రమించి రసభావ సమాహితలోలభావనా
స్ఫురదురు పారవశ్యమున ముంచెజనంబుల శిల్పసామ్యతన్. 86

ఎంతటి యున్నతంపు కళనేనియు తక్కువస్థాయి కోరువా
రింతటనంతనుండు, రటులేయట చేరిన కుఱ్ఱకారు, దు
ర్భ్రాంతిని చిత్రసీమగల పాటలు పాడుమటంచు చీట్లపై
నెంతయువ్రాసి దేశికునికిచ్చిరి, వానిని కోరుడంచొగిన్. 87

ఇంతటి పెద్దపండితుని, నిట్టి మహాత్ముని చిత్రగాన మ
ర్థింతునె ? సక్రమంబయిన రీతియె? నిత్యము గ్రామఫోనులం
దెంతయు నాలకింపరొకొ? యెయ్యది యెవ్వనియొద్ద చేయన
త్యంతరమో యెఱింగి తగునట్లు చరింపగరాదె మానవుల్? 88

అనుచున్ లేచిరి సోదరుల్ గురువరుం, డాతండు సన్నాయి క
ఱను పీకం బెకలించి దాని తన ఛాత్రశ్రేణికందించి, వా
లిన భక్తిన్ పిచిహారి దేశికునితో నేతెంచె నీ చిత్ర కీ
ర్తనలన్ వీరికి పాడువారొరులు లేరా? నేను గాఱంచొగిన్. 89

సరవిన్నిత్యము నెందరెందరొ మహాసంగీత విద్వన్మణుల్
గురునాథున్ దరిసించి తద్విషయముల్ కొన్నింటిచర్చించి అ
క్షరరూపాశిషముల్ గ్రహింతురదెపో గాంధర్వ విద్యా వసుం
ధర నాచార్యునకున్న స్థానమది గంధర్వాంశ సూచ్యార్థమౌ. 90

## పురాణ వైదుష్యము :

మోదుమూడియందు పురాణమును మనోజ్ఞ
భవ్యభణితి జెప్పుచు మోక్షపదముచేర
చనిరి మా తాతగారు, తచ్చరితమెల్ల
పూర్తిచేయంగ తత్సుతుల్ పూనుకొనిరి. 91

అప్పటిదాక మాపితరు లాదరణీయ విధిం బఠింపగా
జెప్పు పురాణముంగడు ప్రసిద్ధుడు వెంకటదానమౌని, ఆ
మొప్పున స్వీయసోదరుల నొక్కరు నెమ్మిపఠింప రాజసం
బొప్పతిలం బురాణము మహోద్ధతి జెప్పు గురుండు నేర్పునన్. 92

కాలపయోదగర్జల కకావికచేయు గభీరకంఠ నా
దాల, మనోజవస్థిరతదాటు వచోమకరంద ధారలన్
దేలుచు శ్రోతృసంఘములు దేహజగత్తుల విస్మరించి, యు
ద్వేల పురాణ గాంగపృథు వీచుల మున్గుదు రప్రయత్నతన్. 93

పౌరాణిక చంద్రునిగా
పౌరయశః కౌముదీప్రసాంద్రుండయ్యెన్
రారమ్మని గ్రామముల
వ్వారిగపిల్వఁ దొడంగె బహుమాన విధిన్. 94

ప్రతివర్షంబును రెండుమాసములు వర్షాకాల మందెవ్వరో
అతిహర్షంబున గౌరవాదరత నాహ్వానింప సోదర్య సం
యుతుడై పోయి గురుండు భాగవతమో, యుద్యద్విశిష్టైక భా
రత రామాయణ గాథలందెదియొ ప్రారంభించు సంరంభియై. 95

పూడివాడ మోదుమూడియు కోడూరు
వక్కపట్లవారిపాలెె; మళ్ళ
రావుపాలెె మళ్లె చావలిపెరవలి
పెద్దవరము మరియు వేకనూరు. 96

ఆదిగనెన్నొ గ్రామములయందు పురాణము ముప్పదేండ్లు నిం
పాది, క్రమంబు తప్పక ప్రియంబుగ చెప్పెగురుండు, జ్ఞానసం
పాదిత విజ్ఞతావిభవ పారగుడై మృదుకీర్తి చంద్రికా
మోద దిశాంతభాగ పరిపోషిత కాంతివిశాలు డయ్యెడిన్. 97

విమల వర్తనుండు వేంకటాచలపతి
చదువుతాపురాణ, ముదయమందు
సంప్రదాయ విషయసారంబు వినుచు దా
శరధిసూరి జ్ఞానశరధి సూరి 98

రసము లనంతమన్ననుడి ప్రబ్బిగురుండు వచించుచుండ నే
రసమున కారసంబు వివరంబుగ నాత్మలపట్టియూచు, వెం
పెసగెడు వీరఘట్టముల నేత్తెర చెప్పెడుపట్ల శ్రోతల
ప్పసగొని వీరులై కరుణపట్టుల శోకపుముద్దలౌనుమీ! 99

పట్టి ప్రధానగాథ ప్రతిభా నవభావ సభాప్రియంబుగా
పట్టగు సన్నివేశములబట్టి జనాళికి పట్ట చెప్పుచున్
పిట్టకథల్ వచింతు రతిపేశలహాస్య తరంగితంబుగన్
నెట్టన పొట్ట చెక్కలుగ నెమ్మి హసింతురు శ్రోతృపుంగవుల్. 100

గురుని పురాణపు వరవడి
యరుదై జనపాళినెల్ల నాకర్షించెన్
మెఱుగులు దిద్దిన చిత్రము
కరమరుదుగ నెట్టి వారి కదిలింపదొకో. 101

తిరుచానూరునకేగి, లోకజనయిత్రిన్ దల్లి పద్మావతిన్
కరుణాదత్త మహేంద్రరుద్ర పదవీ కల్యాణసంస్తుత్య; శ్రీ
గరుడాద్రీశ్వర హృత్పయోనిధి తరంగశ్రేణికా హంసికన్
స్థిరభక్తిన్ దరిసించి నిల్చెగురుడాక్షేత్రాన మూణ్ణాళ్ళగిన్. 102

అచటగలడు తాతాచార్యులనెడు నర్చ
కుండు మా గుడి పూజారి కొఱకు గుఱ్ఱి
అచటి వైష్ణవస్వాముల కతడు తెలిపె
గురు పురాణకాలక్షేప పరమశక్తి. 103

కేవల పండితుల్ గుణనికేతన మండితు, లావులించినన్
ప్రేవులు లెక్కబెట్టగల విజ్ఞులు, పదవిశిష్టపాండితీ
శ్రీవిభవుల్ గురూత్తముని చేరగవచ్చిరి, ఆ దినంబు సం
ధ్యావిధి తత్పురాణ విషయస్ఫుట శక్తి పరీక్ష దక్షులై. 104

గురుని చెల్లెండ్లు, ఛాత్రులు కొంతమంది
నేను చుట్టును వేష్టించి నిలిచియుండ
నేదియో చెప్పుచుండిరి, యింతలోన
వారు వచ్చిరి, గురుడెంతొగారవించి. 105

"ఏమి పనిమీద వచ్చితిరో మహాత్మ
లార ? తెలుపు"డనుచు గురుం డడిగినంత
"తమరు పౌరాణిక శ్రేష్ఠతములటంచు
నరసి వచ్చితిమి పురాణ మాలకింప. 106

అనునెడ వారి మానస మహాబ్ధి తరంగిత ఖిన్నభావ సం
జనిత విలాసహాసరుచి సర్వము తద్ధృదయైక సూక్ష్మ చిం
తనము నెఱింగి సద్గురుడుదారత పల్కె "మహాత్ములార ! మీ
కనుమతమైన దాని వినయంబుగ చెప్పెద కోరుడీ !" యనెన్. 107

"మనమ్ము వైష్ణవులము ఘనశరణాగతి
యొకటె మనకు ప్రాపు సకలపాప
దోషహరణ చణ విభీషణ శరణాగ
తిని వినంగ మాకు మనసు కలదు. 108

తమరు జ్ఞానవార్ధులమలిన వాక్సుధా
పార చరితులగుట సరసులగుట
కాంచనమ్ము తావి కలబోసినటుండు
మాదు జన్మ పండు-మనసు నిండు." 109

అనిన గురుండు మానసమునం 'దిది కొట్టినపిండి మాకు' శ్రీ
వనజదళాయతాక్షుని కృపాపరిపక్వత యిట్లు పండె, పా
లనుగొన గోరె రోగి విరళంబుగ వైద్యుడు పాల నిమ్మనెన్
వేళయిక నాలసింపనగునా ? యని యెంచి పఠించె శ్లోకమున్. 110

రసధుని పొంగినట్లు మధురంపు సమీరము వీచినట్లు ప్రే
యసి మృదు మందహాసరచి హాయిగ పిల్చుచు మల్లికా ప్రసూ
వి సరము రువ్వినట్లు పసిబిడ్డడు ముద్దుగ నవ్వినట్లు వా
క్సరిసరము శ్రోత్ర కర్ణముల ప్రాపెను భావపరీమళార్థముల్. 111

నాగసరము ముందు నాగుబాముల వోలె
శిరములూచి హర్ష పరవశతను
బొమ్మలట్టులైరి పూర్ణసంతుష్టులై
గురుని ప్రస్తుతించి రురువిధాన. 112

"వివరములందు నొక్కటియు వీడక సర్వము తేటతెల్లమై
తవులుచు సూటిగా నెదద తాకిన, దున్నటులుండి చెప్పగా
నవునె మరొండు పండితుల కద్భుత మీ దృశమైన వృత్తమున్?
భవదతిలోక పాండితికి భవ్యవచో విధికిన్ ప్రణామముల్. 113

అనునెడ వారియందొక మహామతిమంతుడు లేచి "ఆర్య! నె
క్కొని మిముగూర్చి యర్చకుడు గొప్పగ జెప్పిన లద్భుతంపు మీ
ఘనత పరీక్ష సేయుటకుగా చనుదెంచితి వీరలెల్ల నన్
వెనుకొన, విన్నదానికిని వేయి మడుంగులు మీ ప్రభావముల్. 114

కననైతిన్ విననైతి నీ క్షణము దాకన్ మున్ను శ్రీ వైష్ణవా
గ్రణులా చార్యులు చెప్పవింటి బళి! శ్లోకం బింత పాకంబుగా
మును పెవ్వారః పఠింప లేదనుచు నా పున్నెంపు జందెంబు పై
మన మారంగ ప్రమాణమున్ సలిపెదన్ మందిన్
ప్రశంసించెదన్." 115

అని నుతియించుచు వారలు
జనితాశ్చర్య ప్రమోద సాగరచరులై
వినతులొనర్చుచు నిండ్లకు
చనిరి నెనరు క్రేళ్ళువార సరసోత్కంఠతన్. 116

అరయ నేలూరుపురమందు జరుగుచున్న
సభలకేగె సోదరుడు దాశరథి సూరి
తో గురుడు తదుపన్యాస ధోరణులకు
సభ్యులెల్లరు నాశ్చర్య చకితులైరి. 117

భాష్య భగవద్విషయ భక్తిభావములను
పారమొందంగ సేవించు వారిలోన
అగ్రతాంబూల మిక వీరిదనుచు పలికి
రచటగల పండితులు ప్రశంసార్హ విధులు. 118

దేవాలయ సేవ :

ఆలయ నిర్మాణముతో
చాలిన మాన్యంబు గూర్చి సక్రమరీతిన్
వేళకు నై వేద్యాదిక
జాలము మా తాతగారు సాగించుతరిన్. 119

ప్రతి వర్షంబును పాంచరాత్ర విధి వద్బ్రహ్మోత్సవం బంచిత
స్థితికల్పింప నభీప్సితంబొదవ తత్సేవా సమారాధనా
యతి విఖ్యాత చరిత్రుడర్చకుడు శేషాచార్య ప్రమోలన్ దగన్
ప్రతిపాదించె గురుండు నాతడును హర్షంబంది కానిమ్మనెన్. 120

ఎన్నఁడో మా పితామహుల కిట్టి తలంపురహింప డబ్బులే
మిన్నిఁజ యత్నమల్లె విరమించిరి, యెవ్వరువచ్చి తద్విధం
బెన్నిన సత్కుద్ధులౌదురు, మరిప్పుడు వారికి నచ్చచెప్పగా
నున్నదె మార్గమంచు మదినూహ నొనర్పగ సాగిరంతటన్. 121

శేషభట్టరాచార్యుండు చేరి "అయ్య!
వరుస బ్రహ్మోత్సవంబు లీవత్సరంబు
నుండి జరిపింప తమ తనయుండు శ్రీని
వాస పెరుమాళ్ళుగారు భావమున నెంచె. 122

తగిన ధనంబుగూర్చి బలితంబగు మీదు ననుజ్ఞకోసమై
మొగిళులవంక చాతకము పోలిక చూచుచునుండె "నన్న" మెం
డుగ భుజియించి యింటికడ నొప్పి యెఱుంగక కూరుచున్న నీ
పగిది తలంపులే తొలుచు, బాపురె, పిల్లల బొమ్మలాటయే ? 123

ఎవ్వరిఁపడ బోయినను నేదియొ యాచకు నట్లు చూచి, తా
మివ్వల నవ్వలంచు నిపుడెక్కడ? రేపని మాపురమ్మటం
చెవ్వియొ పోసుకోల్ కబురు లెన్నియొవాకొని మొండిచేతితో
త్రవ్వుదు రొక్కఁగోయి మనవాంఛలు గింఛలు పూడ్చిపెట్టగన్. 124

పిల్లకాకి కుండేల్దెబ్బ తెల్లమగునె?
పిల్లపెత్తనముల కొక్కయెల్ల కలదె?
వాడు నీవు కలిసి యుత్సవములసేయ
ఆహా! ఆ సొంపు చెప్పంగ నలవియగునె? 125

ఆచార్యా! ఇది వాని పుట్టె తన యంతావిర్భవంబయ్యెనా?
నీ చేయియ్యది రెచ్చగొట్టబడెనా? నిక్కంబు వాక్రుచ్చుమా!
ఏచున్ గొంతెమకోర్కులిట్లె పనిపాటే లేక కూర్చున్నచో
తోచున్‌లోదిగ లోతుపాతులు నలంతుల్ పల్కనే కార్యమా? 126

అనిన నాచార్యుడీయెడు ఘనవిధాన
పరగు బ్రహ్మోత్సవమ్ములో బాబుగారు!
మీయనుజ్ఞ యొక్కటియెచాలు, పలుకుంచు
వచ్చి గురునకు తద్రీతి మెచ్చిచెప్పె. 127

దివిసీమన్‌గల భక్తులందఱును భక్తిశ్రద్ధలుప్పొంగ ను
త్సవ సందర్శన మెంచివచ్చిరి మహా సంతోషభారంబుతో
శ్రవణీయాత్త పురాణముల్ హరికథల్ రమ్యంబులౌ నాటకా
లవురా! యెన్ననిచెప్ప వైభవ కళావ్యాసంగ సందోహముల్. 128

వచ్చినట్టివారు వండుకతిన సమ
యమ్ము కొంత వ్యర్థమయ్యె పిదప
నట్లు కాదటంచు నందరికొకచోట
భోజనములు చేయు పొలుపుగూర్చె. 129

ఈ విధి బ్రహ్మోత్సవములు
వావిరి సిద్ధింపగురుడు ప్రారంభించెన్
ఠీవి నిరాఘాటముగా
పావన విధి సాగుచుండె ప్రతివత్సరమున్. 130

గురుడీక పదిరోజులకున్
గరమరుదుగ నస్తమించు కాలమునందున్
తిరునాళ్ళ మూడురోజులు
జరిపెదమనిరంట యెవరొ సరి మా యింటన్. 131

చింతాబ్ధి వీ
ఆ మాటన్ విని యార్తితోడ పరితప్తాంగుండు చింతాబ్ధి వీ
చీమాలా చలితాంతరంగుడయి, "నే జీవించియుండంగ నా
స్వామిశ్రీ తిరునాళ్ళ మూడుదినముల్ పాటింతురే? నేటికిన్ 132
నాముందే యిటువంటి కార్యగతులన్ గల్పింప సైరింతునే?"

అని యా౽శమునంద సద్గురుడు, "సౌమ్యస్వాంత్రిమాయమ్మ, ఓ
అనఘా! యేటికి లేనిపోని యతులాయాసంబు పొందంగ? ప్ర
విచ్చిన మీ మాటను కాదటంచు నెవరున్ ఖీష్మింపగా బోవ"రం 133
చను తాపంబునుబాప తుట్టతుదకున్ శాంతించె చిత్తంబునన్.

ఎండకెండి వానకు నానుచుండె సతము
నాలయ ధ్వజస్తంభమట్లైన యెడల
కొలదిలో పుచ్చిపురుగులై కూలిపోవు 134
నిత్తడితొడుగు వేయింప హితవటంచు.

తానుగ కొంతయిచ్చి, హరిదాసుల యొద్దను భాగ్యవంతులౌ
మానుసులొద్ద కొంత, తగుమాత్ర విరాళములోలిగూర్చి యెం
తేనియు గట్టిగా తొడుగు నేర్పడగూర్చె గురుండు నెంతకా 135
లానకునైన తద్ధ్వజ బలం బిసుమంతయు తగ్గకుండగన్.

అమ్మవారికి స్వామికినైన నొక్క
భూషణంబును లేకుంట శేషభట్టు
రార్యుతో గూడి చందాల నమరజేసి
పెక్కు నగలను చేయించి రక్కజముగ. 136

మూలవిరాట్టు సన్నిధిని ముందు జయుండును తోడునీడగా
నోలగమందు జేరి విజయుండును లేరని, వారులేని యే
యాలయమందునైన తగు నందము కల్గదటంచు తత్ప్రతి
ష్ఠాలఘు కార్యసాధనకు నంకితమయ్యె గురుండు భక్తిమై. 137

తన నగలమ్మి స్వామికి ముదంబుగ శాశ్వత సేవ యెద్దియో
పొనరుప నెంచి మా జనని, పూనిక సర్వము పూసగ్రుచ్చి మా
జనకుని చెవ్విపై చినది. సాగిన హర్షము మిన్నుముట్ట యొ
ప్పునెయెదియోయనన్ వెదుకబోయిన తీవియ కాళ్ళపైబడిన్. 138

జయ విజయుల ప్రతిష్ఠింపజతనమొండు
చేయుచుంటి తత్ఫలితంబు చేరెనిన్ను
ఎంతటి దయామయుడు భగవంతు డిట్టి
కోర్కెకల్పించి నెరవేర్చుకొనియెనిట్లు. 139

అని ముదంబ యంగీకారమును గ్రహించి
నగల నమ్మించి ధనము సొంతముగకూర్చి
విజయవాటిక చేయించె విగ్రహముల
నందఱును వానియందంబు చందమెన్న. 140

గడచిపోయిన యుత్సవకాలమందు
జయ విజయుల ప్రతిష్ఠ ముచ్చటగ ముగిసె
క్రొత్తకళవచ్చె వైభవరూఢి హెచ్చె
ననుచు హరిదాసులెల్లరు వినుతిసేయ. 141

అమ్మవారి సన్నిధిని జయావిజయుల
మహితగతి ప్రతిష్ఠింప నెమ్మది తలంచి
యత్న మొనరించిరా భారమవధరించి
స్వామి చెల్లెంద్రుడు పూనిరా పనిఘటించి. 142

స్వామి రథోత్సవం బతుల వైభవపాత్ర మహంబొనర్ప నే
బాముల నొందియైన నొకపాటి రథంబునుగూర్ప, గాఢ వాం
ఛా మధురైకపావనత సాగెవిరాళములన్ గ్రహింప దీ
క్షా మహితాత్మకుల్ సలుపజాలని కార్యములుండునే ధరన్? 143

కొన్ని దినాలకే ధనముగూర్చి రథంబును చేయునైపుణిన్
గన్న సమర్థుకోసమయి, కన్నుల వత్తిడిచూచి, యిందు పే
రెన్నికగన్న వాడనుచు నెవ్వరొచెప్పగ విశ్వసించియున్
దిన్నగ పూడివాడకును తీసికువచ్చిరి యొండు సాహెబున్. 144

ఆతడు మును తేరొకటియైనను చేసినవాడుకాడు కా
ని తన బుద్ధి పాటవవినీతి ఘటింపతలంచి వచ్చి సం
ప్రీతిగ నొక్క వర్షము శ్రమించి రథంబును చూడచక్కనౌ
రీతి నొనర్చె దానిగని తృప్తినిహొందిరి సర్వమానవుల్. 145

చేతకాదయ్యె చక్రాలచేత వాని
కందుచే శతాంగము ముందు కరుగదయ్యె
నేరుగా, దానిలాగ చేకూరకుంట
బాగుచేయింపగురుడు భావమునదలచి. 146

చీరాలన్ పనివాడొకండు రథముల్ చేయన్ సమర్థుండటం
చారాతీసి గురుండు వానికొఱకై యత్నించి రప్పించి యే
మేరన్ దానిని బాగుచేయనగు నామేరన్ ఘటిపింప, నే
డౌరా! కొంత సుఖంబుగా కదులు సుమ్మా స్యందనంబందమై. 147

నలిగా నెండకునెండి వానలకు నానన్ సాగె నిత్తైన దు
ర్బలమై బూడిదపోయు నేతివలె వ్యర్థంబౌ శ్రమంబెల్ల, ని
ర్దళనంబౌ రథమెల్ల పుచ్చిపురుగై రాలున్ ధరాభాగమం
చలవౌ గేహమొకండు కట్టనగునంచాలోచనల్ చేసియున్. 148

కోవెల వెన్కభాగమున కొద్ది ప్రదేశమునందు నున్నతం
బై విపులంబునై యెసగునట్టి గృహంబు నొకండుకట్టి శ్ర
ద్ధావిధి తేరునందునిచి, తద్దయుజేసెను కట్టుదిట్టమున్
వారిసద్గురుండు, హొలపంబుగ సోదరపాళి తోడ్పడన్. 149

గురుడు కావించు ప్రతికార్య గరిమవెనుక
వారి సోదరుల సహాయ పరత వెలయు
దైవకార్యంబు లొనరించు తరుణమందు
నాకలియు దప్పికలనెంచడయ్యెగురుడు. 150

యజ్ఞ నిర్వహణ :

జీవితమందు యజ్ఞమును చేసినపున్నెము, నాత్మతృప్తియున్
భావనజేసి, యెందు క్రతు భారముపూనె గురుండు తత్క్రియా
పావనశీలమై యఖిలవర్గము, పుత్రులు - సోదరాత్మజుల్
తీవరపాటుతో పనులు తీరిచిదిద్దిరిగాఢ కాంక్షతోన్. 151

ఒకమాపై యెవరెట్టి కార్యమున కుద్యోగింపగా నర్హతా
ధికులో తామదిపూని సర్వమును సంధింపంగ శ్రీవారి వా
ర్షిక కల్యాణపువేళ లోకజనతాక్షేమంబు ధ్యేయంబుగా
ప్రకటీభూత విశిష్టశాస్త్రవిధి తీర్పన్, సాగె సప్తాహ్నముల్. 152

జన్మ మొనరింప ధనమెంతొ జతనుపడిన
గాని సాధ్యముకాదంచు కార్యమెంచి
వేంకటాచలపతి నెమ్మి వెంట నడువ
దాశరధి సూరితోసాగె ధనముకొఱకు. 153

పొన్నపూలవంశ పూర్ణరాకాశశి
కలడు సంజీవరాయుడన్ ఘనయశుండు
అతడదేపేర భాసించు నన్నతోడ
బహు విరాళములనుగూర్చి సహకరించె. 154

స్వామి బావమఱది రామబాణము భర్త
వేంకటేశ్వరాఖ్య వెలయునతడు
నన్నదానమునకు నతులితంబగుధాన్య
మొసగువాడనంచు నుద్యమించె. 155

తనరెను సవనము మెండై
జనసందోహంబు వచ్చె సాగరవీచీ
ఘనమాలాకృతి స్వాహా
నినదము లాశానభోవనీ స్థలినిండన్. 156

దీప్తిస్వామి శిష్యులుకల్గు దివిసీమ
బంగరపు సీమయై ధాన్య వస్తురూప
ధనము పెల్లుగనిడె, హరిదాసులెల్ల
నున్నదానిలో నిచ్చిరి యుత్కటముగ. 157

సౌమ్యశీలుండు రామప్రసాదు యజ్ఞ
కార్యముల పర్యవేక్షింప, క్రతు దినాల
వచ్చువారికిలేదని పలుకకుండ
నన్నదానంబుసాగె ననంతమగుచు. 158

శ్రీలక్ష్మి నారాయణ
మూలంబగు కోటి హవన పుణ్యసవనము
ద్వాలస్పూర్తి నొనర్ప వి
శాలంబగు పొలమునందు శాలలు లేచెన్. 159

అతిపవిత్రము లష్టాద శాగ్నికుండ
ములును గోమయ లేపన పూర్వకముగ
భూషితములయ్యె, ఋత్విక్సమూహమెల్ల
నరుగు దెంచెయజ్ఞక్రియా పరమ నిష్ఠ. 160

అశనమంటు పందిళులు, సన్నపురాసులు, నేతికుండ లే
మే కడపారజూడ సరబృందము, లాహుతులీను వాస నా
స్తోకము, శాస్త్ర చర్చలును, సుందర విష్ణుకథా ప్రసంగముల్
ప్రాకట విష్ణులోక మిటు వ్రాలెనటంచు నుతించిరందఱున్. 161

ఇరువది బియ్యపుబస్తా
లరుదుగ 'ప్రతిపూట' వండినప్పటికింకన్
తరుగదు జనసందోహము
నొరుగదు వడ్డించువారి యోర్పింతైనన్. 162

పప్పును పిండివంటలును పచ్చడులున్ పలురీతి వ్యంజనా
లప్పడముల్ ఘృతంబును ప్రియంబగు చారులు పండ్లు జిడ్డుపై
తెప్పలుగట్టు క్రొంబెఱుగు తీయని పాయసముల్ రహింప పెం
పొప్పిన షడ్రసంబులవి యొప్పె సహస్ర రసాత్మకంబులై. 163

అరుదౌ లాజలు రావిపేళ్ళు సమిధల్ హైయ్యంగవీనంబు ఖం
గరురేకుల్ నవధాన్యముల్ చరువు ముఖ్యంబౌ పురోడాశ మ
క్కరస్వాహానినదాత్త మంత్రపఠనాల్రేంత ప్రశాంతక్రియా
నిరతిన్ ప్రేల్వగ వీతిహోత్రుడు ప్రఘానిర్ఘోషకీలోష్మడై. 164

జ్వలియించెన్ నవదివ్య దీధితులతో సవ్యాపసవ్యంబుగా
నలఘువ్యాప్త పరిమళానిల తరంగానేక డోలావి ని
జలశ్చసంచార సహిష్ణుతా ప్రముదిత స్వాహావధూస్నిగ్ధుడై
నల్వస్వామి స్వకీయకీలలు నభః పర్యంతదీప్తంబుగన్. 165

ఇది జన్నంపు ప్రసాద, మీసపన సర్వేశుండు లక్ష్మీశుడే
కద. కాబట్టి హరి ప్రసాదమనుచున్ గాక్షించి భక్షింప స
మ్మదమే పొరగ సాగివచ్చిరి జనుల్ మాన్యంబుగానెంచి. నె
మ్మది సామావృత యజ్ఞవాటికి మహామంత్ర ప్రభాపేటికిన్. 166

అన్నియెడలను తానయ్యె యరసి యజ్ఞ
భారమెల్ల నిర్వర్తించె పరమగురుడు
జరిగె పూర్ణాహుతియు దివ్యసౌరభములు
నఖిల భూనభోవ్యాప్తమై యలమెదెసలు. 167

యజ్ఞాంతంబున సద్గురుండు ననుజుల్ హర్షంబుతో భార్యలన్
ప్రజ్ఞారాసుల గూడి తా మవభృథ స్నానంబు గావించి ది
వ్య జ్ఞానాంచిత తేజులై వరలిరి భవ్యంపు యాగంబుదై
వాజ్ఞాయత్తవి నిర్మితంబని ప్రమోదాంభోధి నిర్మగ్నులై. 163

ఆలయ ప్రాంగణంబున నందమైన
మంటపమొకొండు నిర్మింప మనసుపుట్టి
తమ్ములందఱి సహకార ధనవినీతి
నాలయము ముందు మండపంబమరజేసె 169

లలితోల్లాస విధాపురాణముఖ కాలక్షేపముల్ శాస్త్ర చ
ర్చలు నెన్నేనియు చేయగాదగు మహాస్థానంబుగా పుణ్యసం
కలితంబయ్యెను నేడు మండపము సంకల్పంబు లౌజ్జ్వల్య ని
ర్మల నిర్దిష్టములైన సత్క్రియలు క్షేమ శ్రీదముల్ గావొకో ? 170

# తపస్సిద్ధి

## వ్యక్తిత్వ ఖండము

శ్రీనివాస గురుండన చెప్పనలవి
కాని మర్యాద ప్రజల హృద్గత ధనమ్ము
ఊరనేదేని కలహంబులుప్ప తిలిన
చెప్పికొందురు ధర్మంపు టొప్పుదలకు. 1

మా గ్రామమున నొకమారు ఘటిల్లిన
సంఘటనంబిందు సంతరింతు
అన్నదమ్ములు తండ్రియాస్తి సమంబుగా
పంచుకొనుట, భేదభావమడరె
ఇంటిముంగిట నొక్కటెనయు కొబ్బరిచెట్టు
నధికఫల ప్రదంబగుచు మించి
అది యెక్కువగనుండె నన్నభాగమునందు
తమ్ముననద్ది బాధను ఘటించె
అతడు తన మామయును బంధుహితులకూడి
వచ్చి యా చెట్టు తనపాలు భాగమందె
యదరి సట్టులు చెప్పించి యాక్రమించి
బలము లేనియన్నదురు మనోబాధనించె. 2

అతడువచ్చి సద్గుని ఆశయమంది "గురూత్తమా! గుణా
న్వితులు పక్షపాత గతినేర్వరు, నేర్చినవారు ధర్మ సం
స్థాతలుకారు, మీరుపెలుచన్ చనుదెంచి సరైన న్యాయమున్
ఖాతకు నాకు చేయుడని ప్రార్థనచేసె విధేయ బుద్ధియై. 3

ఆతని ప్రార్థనంబువిని అచ్చటికేనరుదెంచి న్యాయ సం
ప్రీత పథంబు తెల్పినను వీనుల జొన్పరు, నీ ప్రయాసమున్
నా తలపోతవ్యర్థమగు నట్టివ్రతోత్కెడు స్వార్థవర్తన
స్వాంతలకెందు ధర్మగతి సౌరు రుచించునె? మంచియించునే? 4

అని ఆచార్యుడు పలికిన
వినకాతడు కొంచుపోయె, విస్ఫుటఫణితిన్
గొని గురుడు ధర్మమిట్లని
యనయంబును చాటి చెప్పెనందరు వినగన్. 5

అత్యధికంపు పాలుతరు వగ్రజుభాగము చొచ్చియుండె నీ
సత్యములేల? తండ్రిదగు సంపద నిద్దరుపొంది సౌఖ్య సం
స్తుత్యులుకండు. నేనుడుపు చొప్పున నిర్వురు నీరుపోసి త
న్నిత్యఫలంబు నిద్దఱును నెమ్మి సమంబుగ నారగింపుడీ! 6

అని యెన్నెని విధంబులన్ నుడువ నత్యాశాపరుండై కటా!
అనుజుండొప్పక యడ్డదిడ్డముగ మాటాడన్ విలోకించి, కో
పనిరూఢిన్ గురుడగ్రజున్ బిలిచి యో వత్సా! మహీజంబు చ
చ్చినచో నెవ్వరి కెందునంచదుగదా "చెందున్ ధరాభాగమున్". 7

అని యాతండు వచింపనిట్లనెనపుండాచార్యుడా చెట్టు చ
చ్చినదంచున్ తలపోసి యూరడిలుమా! సిద్ధించునే స్వార్థచిం
తనులొద్దన్ తపశ్శైక ధర్మపథ సిద్ధాంత క్రియామార్గముల్?
ఘనదోషాకరణోగ్ర ఘోరతిమిరౌఘ ప్రాప్తికాకిద్ధరన్. 8

అని కోపస్థితి సాగిపోయెగురు డత్యంతంబు హర్షించె నా
తని తమ్ముం, డటు రెండునాళ్ళరుగ సంధ్యా వేళ మేఘావళుల్
ఘనగర్జారవ పూరితాఖిల దిశాక్రాంతంబుగా వేగ వ
ర్ధనతన్ మిన్నును మన్నునేకమయి సంరంభించె వర్షంబొగిన్. 9

మెఱసె, కండోయి కడు మిరుమిట్లుపొందె
ఉఱిమె చెవిజంట బళ్ళున పరియవారె
పిడుగుపడె, చచ్చెనా చెట్టు, విగ్రహించి
శాపమిచ్చె గురుండనసాగె జనత. 10

చెఱుకుపల్లి యన్ గ్రామంబువరలు నొండు
ఆరుమైళ్ళు దూరంబు మాయూరి కద్ది
రెండుగ్రామాల మధ్య చరించువారి
దోచుచుండిరి రేలందు దొంగలచట. 11

మట్టిరాముడనెడు వట్టి మోటు మనుష్యు
డొకడు గురునియింట నొప్పుచుండు
మంచివాడె కాని, మాటతీరెరుగండు
మంచి చెడులులేని మంటిముద్ద. 12

వాడొకసారి యన్యుల వివాహపు వస్త్రముమూట నెత్తిపై
పిడక నిల్పి యొంటరిగ భీతి నెఱుంగక యర్ధరాత్ర మం
దోడక వచ్చుచుండ కని యుద్ధతిచోరులు నిల్వరింప నో
రాడక మెల్లగా ననియె నాతడు నిల్వున కంపమొందుచున్. 13

పెద్దగురువుగారియొద్ద పనిచేయు
జీతగాడ, వారి చిన్నబిడ్డ
పెండ్లిగుడ్డ లివ్వ, వెసదెచ్చుచుంటిని
చెఱుకుపల్లినుండి సరసరీతి. 14

అన వినివార 'లిద్దినిజమా నొకో? గుడ్డలు వారివొనె? వా
కృఛణత నబద్ధమాడినను చచ్చెదవిప్పుడు మాదు చేతియం
దని బెదిరింపవాడు నిసుమంతయు జంకక చెప్పె తద్గతిన్
“చనుమిక నీవు లేచిన క్షణంబది మంచిది. చెప్పకేరికిన్.” 15

అని తొలగిపోయిరట, వా
డనువుగ చనుదెంచి చెప్పెనందఱకును స
జ్జను అగువారికి కీడును
పొనరింపగలేరు దురితపూరితమతులున్. 16

గురుడు పొలములోన కూర్చుండి కూలీలు
కాల్వ ద్రవ్వుచుండ కాంచుచుండె
కారులోనబోయె కడుపెద్ద యధికారి
'మున్స'బింటికడకు పొందికగను. 17

అతడు 'ప్రొక్యూరుమెంటు'కై యరుగుదెంచి
“పంటలే విధి గ్రామాన పండెననగ”
తలకు నొకరీతి చెప్పిరి. తలకియతడు
“పొలమునందున కన్గొంటి పోతనార్యు.” 18

వారిని పిల్వనంపు, డిటు వారు వచించిన దాని కొప్పెదన్
ఖారపు కష్టమొందిన నబద్ధము పల్కదు వారి నాల్క"నాన్
"బోరననేగి పెద్దగురుపుంగవు తోడ్కొనిర"మ్మటంచు న
వ్వారిగ వెట్టినంపె ననివారణ 'మున్సబు' సంతసించుచున్. 19

క్రన్నననేగుదెంచు గురురాజునుగాంచి యతండుతేచి, సం
ఛన్న విశేషగౌరవ విసర్పణ తన్‌తగు మాటలాడి, యే
తెన్నున సద్గురుండు గణుతించి వచించెనొ దానికొప్పి, యే
గెన్నిజ ధర్మమార్గ పరికీర్తను లెందును గౌరవార్హులే. 20

ఇట్టి విలోకవృత్తముల నెన్నిటి వ్రాసెద, నిట్టి గ్రంథముల్
గుట్టలు గుట్టలై వెలయు, కొన్నిటి మాత్రము పేరుకొంటి నె
ప్పట్టున నొక్కటే వెతుకుపట్టిన నన్నపు రీతి స్పష్టమా
నట్టుల యెంచుకోగలరు, ఆర్యగురూత్తము ధర్మసత్కృతుల్. 21

స్త్రీలకును కాన్పు కష్టమై చెలగెనేని
జలము మంత్రించి గురుడిచ్చు క్షణమునందె
సరసగతి సుఖప్రసవంబు సంభవించు
తలపనిట్టిది గురుని మంత్రంపు మహిమ. 22

గాలియు ధూళిసోకి, భయకంపితులై జ్వరబాధసోకి యు
ద్వేలత తూలిసోలు పసిబిడ్డలు స్త్రీలును వచ్చి వేడినన్
జాలిన సత్కృపన్ గురుడవారిగ భక్తిని నాంజనేయ రూ
పాలఘు బీజవర్ణ కలితాంచితమై తగు రాగిబిళ్ళలన్. 23

తన జపమందు నుంచుకొని తద్దయు మాసమునాళ్ళ తత్తపో
ధనమును ధారవోసి ప్రమదంబుగ వారికినిత్తు రొక్క చె
ల్లని యెఱిగానినేన్ ప్రతిఫలంబుగ ముట్టరు, మానవాళులన్
వనిపిన మాధవున్ దనిపినన్ ఫలమొక్కటిగా తలంచుచున్. 24

ఇట్టి త్యాగభోగ విరక్తు నెందుజూడ
బోమటంచును ప్రజలు సంపూర్ణభక్తి
ధీనివాసుని సద్గురు శ్రీనివాసు
తలచుచుండిరి భక్తినిస్తుల మనీష. 25

సాహిత్యసేవ:

సరససాహిత్య విద్యావిశారదుండు
అలఘు తర్కశాస్త్రాంబోధి చులుకితుండు
రమ్య కవితాపటుత్వ విరాజితుండు
శ్రీనివాసగురుడు సుధీమానితుండు. 26

ఘనత లక్ష్మీస్తోత్ర మొనరించె సంస్కృత
భాషావిశేష సంపద్విభూతి
మృదురీతి శేష నగేశ స్తవంబను
మధుర పద్యకృతిని మహిమనెఱపె
పద్యంబు వ్రాసిన పండితులకేగాని
పామరులకు నందుబాటుకాదు
కావున గద్యంబె కడుహృద్య మగునంచు
నిర్ధరించుకొనియె నిండుమతిని.

మానితపు విశిష్టాద్వైత మతమునకును
మూలభూతులౌ నాళ్వార్ల పూతచరిత
తేటతెల్లంపు తెలుగున తెలుపుమనుచు
శిష్యులెల్లరు కోరిన స్వీకరించి. 27

సరవి, పూర్వాచార్య చరితమన్ పేరున
రామానుజచరిత్ర వ్రాసె ప్రతిభ
మూలమందునలేని చాల ఘట్టంబులు
సేకరించి పసందు చిందజేసె.
స్తుతిపాత్రముగ "దివ్యసూరి హృదయ"మనన్
గ్రంథంబు రచియించె ప్రథితరీతి
సరసత 'నాచార్య పురుషుల చరితంబు'
తేటతెన్గు పదాల తీర్చిదిద్దె.

"దేవుడున్నాడ?" యనుపేర దివ్యకృతిని
తర్కశాస్త్రాన్ని బద్ధాప్ప తర్క్యగరిమ
వ్రాయుచును ముగియింపక పరమపదము
చేరనేగిరి సంప్రీతి శ్రీశునాజ్ఞ. 28

తర్కశాస్త్రాబ్ధి గర్భసంతాన మగుచు
తర్క మిసుమంత నేర్వని దానిగూర్చి
సిగ్గుపడుచుంటి, తర్క ప్రసిద్ధిగన్న
గ్రంథమెట్లైన పూరింప గడగియుందు. 29

తండ్రి రచియించుచును స్వర్గతలముచేర
భట్టబాణుని కొడుకు చేపట్టిదాని
తద్రచనగ కాదంబరి తనరపూర్తి
చేసె నాత్మజ పదకృత సిద్ధికాగ. 30

హరికధా గానము :

"సంగీతంబును సాహితీగరిమమున్ స్వల్పంబుగానైన లే
కంగీకార కుతూహలుల్ హరికథాహంకారులేతెంచి, యు
త్తుంగాగ్రాసన మందలం కృతులుగా ద్యోతింప సామాన్యుల
ట్లుంగూర్చుండియు నాలకించెదరె విడ్డూరంబులౌ తత్కథల్?" 31

అనుచు మా పితామహుడెప్పు డాత్మజులను
హెచ్చరించుచు నుండంగ నిచ్చగించి
హరికథాగాన నైపుణి గురువరుండు
గట్టి కృషిచేసి తొలిసారి గజ్జెకట్టె. 32

హరికథకాదు దివ్య మధురామృతధార, నభస్తరంగిణీ
పరిగళితంబుగా రసవివర్ధితమై హృదయాళిజొచ్చె ని
ర్భర పరమాద్భుత ప్రచురభావములొప్పగ కుడ్యచిత్ర సుం
దరముగ నిశ్చలాకృతులు దాల్చిరి ప్రేక్షకు లూహబద్ధులై. 33

ఆత్మజుడు చెప్ప హరికథ నాలకించి,
ఉబ్బితబ్బిబ్బులయి పుత్రు నొనరబిలిచి
దృష్టితీయించి దీవించి, యెంతొ తృప్తి
నందిరిపితామహులు గర్వమంకురింప. 34

గురుని హరికథకును కాల నిరతియుండ
దారుగంటలపైమూతె, వారిగాధ
యున్నరోజున జనసంఖ్య నెన్నరాదు
నింగికురిసెనొ? నేలయీనినదొనాగ. 35

వీరరసంబు శాంతమును విస్తృతభక్తియు నన్నిరూపులన్
గూరిమిదాల్చి ప్రేక్షకులకున్ గనుముందట విందుగూర్చు త
చ్చారిమ వేగవంతమయి సత్త్వపుధాటి వహించిసాగు, నె
వ్వారి కథాప్రసంగముల బాపురె! యిట్టి పసందులేదనన్. 36

హరికథ చెప్పునట్టి విధమారసి, యెందరొ గౌరవంబుగా
గురునికథా నిమిత్తముగ కూరిమివేడిన పూడివాడతో
తరమిడి యాలయంబు కడతప్ప పరాయి స్థలంబులందు నే
హరికథ చెప్పనంచు వినయంబుగతా ప్రకటించె స్పష్టతన్. 37

# తపస్సిద్ధి

## గృహస్థఖండము

వరసతి బాలమాంబ నిజపత్నిగ నిష్ఠ గృహస్థ ధర్మ సం
భరణత సంతతిన్ బడసి భవ్యపదోన్నత చిత్తవృత్తితో
వరలె గురుండు బిడ్డల ప్రవర్తన తీరిచి దిద్ది విద్యలన్
గఱపి ప్రశాంత సుందర సుఖ ప్రభవైక గభీర సారుడై. 1

అల తొలి సుతుడు వృషాద్రి పత్యాహ్వయుం
డలరు పండితుడన్న ఖ్యాతిగాంచి
ఆతండు తెలుగుపన్యాసకుడై యెన్నొ
గ్రంథముల్ రచియించి గణనకెక్క
సుగుణాలవాల సంస్తుత మృదుశీల ప
ద్మాలయాదేవి నర్ధాంగిజేసె
పరగంగ వారికి పద్మావతీప్రసా
దను కొమరుండును, 'అవనిజ'యును

కుముదవల్లియు నిర్వురు కూతులమరు
నందు నవనిజకును పెండ్లియయ్యె. భర్త
శ్రీనివాసనంగ వెలయు, శ్రీశపాద
భక్తి చిత్తత వారలు వరలుచుండ్రు. 2

రెండవ కొమరుండు కృష్ణప్రసాదుండు
పౌరాణిక శ్రేష్ఠ పదనుతుండు
వాస్తు శాస్త్రంబున వరణీయ కృషిసల్పి
ఖ్యాతిని గడియించి గణనకెక్కె
అకలంక చారిత్ర ప్రకటిత సచ్ఛీల
అలమేలు మంగతాయారు నర్ధి
భార్యగా బడసియు వర్ధిల్లుచుండెను
అల 'నీళ' 'కంజాసన'లన నిద్ద

రాత్మజాతలు శ్రీ మనోహరుడు నాగ
బరగు కొమరుండు కలరు నిర్భరత నెపుడు
శ్రీశపద భక్తి నిర్మల చిత్తులగుచు
దివిసీమన నుండిరి లీవి మెఱయ. 3

అల తృతీయ సుతుండు యతిరాజ సంపత్కు
మారుండు, సుగుణాల మారుపేరు
సరసంబుగా హరిశ్చంద్ర వేషము దాల్చి
పటు కీర్తి బడసిన నటవతంసు
డచ్చచారిత్ర క్రియాశీల సంపన్న
వరలక్ష్మి నతనికి భార్యజేయ
వారికి సంతాన ఫలమింక కలుగమి
నధిక పుణ్యక్రియా హర్షులగుచు

పరలు చుండిరి వ్యవసాయ పరిధిలోన
పూడివాడ నివాసంబె పూజ్యమనుచు
నెంచి అతిథుల గని గారవించుకొనుచు
వారికిని సంతునిడ భగవంతు గొలుతు. 4

భార్గవీదేవి పావన భవ్యశీల
స్వామికిని పెద్ద సుత, వినిర్భర చరిత్ర
నెలమి వెంకటేశ్వరరావు కిచ్చి పెండ్లి
చేసి యాచార్యుడానంద సిద్ధిబొందె. 5

దీవిసీమ యుప్పెన పొంగి దేశమెల్ల
నల్లకల్లోల మొనరించె నందు భర్త
పుత్ర పుత్రికా సహితయై పుణ్యవతిగ
అబ్ధి గర్భంబులో చొచ్చి ఆమె చనియె. 6

ఆమె పెద్ద కూతు హరిప్రియ యను నిసుగు
పెంచి పెద్దచేసి గురుండు పెండ్లి చేసె
నలరు జయరామున కొసంగి, ఆత్మజుండు
వెలయ కల్గె వారికి 'భార్గవీప్రసాదు'. 7

స్వామి రెండవసుత జనకజాదేవి స
ద్గుణజాల, మృదుభావ జనితశీల
అల తోటకూర్మవంశాబ్ధి శశాంకుండు
పొనరు రాధాకృష్ణమూర్తి ఘనున
కిచ్చి వివాహంబు నెలమి చేసె గురుండు
వారి కిద్దరు పుత్రులలఘు గుణులు
రహి కమలేంద్రుడు రాజమన్నారను
పేరులతో నొప్పువారు సుమ్ము.

పుణ్యరతుడు రాధాకృష్ణమూర్తి నేడు
సిండికేటు బ్యాంకున సుప్రసిద్ధమైన
పదవియందుండె, హైదరాబాదునందు
వారు వసియించుచుండిరి వాసిమీరి. 8

తోటకూర వంశ తోయధి చంద్రుండు
మనసు వెన్నపూస మాటమృదువు
సకల సుగుణములను సలిపె రాధాకృష్ణ
మూర్తిననుచు జనతపొగడు సతము. 9

నాలవసుతుడు జనార్దనస్వామి, సం
భృతమృదు గుణశీల చతురగుణుడు
వృక్షశాస్త్రమునందు నింపొందుసట్టియు
పన్యాసకుండను ప్రతిభగాంచె
భవ్యగుణ విశిష్ట పావనచారిత్ర
యైన మాధవిని యర్ధాంగిగాగ
బడసియిద్దరు తనూభవలను పొందెను
రత్నాలయకుమారి, రమ్యఫణితి
చదువుచుండెను వైష్ణవి మృదులరీతి
వరలుచున్నది కడుపిన్నవయసువారు
వీరినందఱ కరుణాప్రవీక్షణముల
నరయుగావుత శేషభూధర విభుండు. 10

తనివారు వేంకటదాస మౌనీంద్ర
ఘను రెండవసుతుండు క్రమగుణుండు
శ్రీనివాస బుధేంద్రు చెలగుతమ్ముండు
జ్ఞానియౌ వేంకటాచలపతి గురుడు
అతిలోక గుణసాధ్వి అమ్మన్నమాంబ
సతిగాగ నిర్వురు సుతలను బడసె
తనియు హరిప్రసాదము జ్యేష్ఠపుత్రి
యెనయు కిరితితావి - ఇందిరాదేవి
తేజోఘనుండు సరోజనాభుండు
భ్రాజితశీల వర్తనుడు సుతుండు
వీరందఱును తమ బిడ్డలు పాప
లారూఢి క్షేమాన నలరారుచుండ
వర్ధిల్లుచున్నారు వైభవంబొప్ప
అర్థమారోగ్యమ్ము నతిమాత్రముగను. 11

అల దాశరథిసూరి హరిపాద భక్తి
నలరారు గురుదేవు నవలితమ్ముండు
లలిసరోజాదేవి శ్లాఘ్యచరిత్ర
అలఘుగుణాబ్ధి నర్థాంగిగా బడసి
సుగుణుండు వేంకటనగరాయధీరు
ప్రగతిశీలుడు రంగరాజ పెర్మాళ్ళు

సన్రమతానిధి దేవనాథ సూరియును
కన్రమవర్తనుడైన రఘుశేఖరుండు
స్థిరగుణవర్తి వంశీధరమూర్తి
వరపుత్రులై ఖ్యాతి వర్ధిల్లుచుండ
మూవురుసుతులకు మొగిపెండ్లిచేసె
నావల సర్వభోగాళి చెలంగ
వారు పిల్లలతోడ వర్ధిల్లుచుండి
రారోగ్య భాగ్య సౌఖ్యాత్ములై యవని. 12

రామప్రసాదుండు రమ్యగుణుండు
శ్రీ మహిళాతుల్య స్థిర సౌమ్య ధుర్య
ఘనగుణజాల వెంకాయమ్మ పతి
గను చంద్ర సహజను గాంచె నందనను
సుగుణధామ ద్వితీయ సుత వేదవల్లి
సుగతికి జనె పుత్ర సుతలను వీడి
అరయ పంకేజ మూడవ తనూజాత
వరకుమారుడు వేణుపాణి ఘనుండు
వారలు సంతాన భవ్యభోగముల
కీరితితో వెల్లుకేరుచున్నారు. 13

రామబాణమ్మ నిర్మల భావధామ
స్వామికి ననుజాత సాధ్వీసుజాత

పద్యాల వేంకటేశ్వరు వరుగాగ
హృద్యంబుగా పొంది యెనలేని ప్రేమ
సరసు గోపీచంద్ర సామిధీనిధిని
ఇరవారగా సింధుజేంద్ర ప్రసాదు
మోదహితుడు దేవనాథుండు నాగ
హ్లాదంబుతో ముగ్గురాత్మజుల గని
ఉదయలక్ష్మి గుణమహోదయశీల
సదమల విఖ్యాత చరితను సుతను
బడసియు వేంకటాచలపతి గురుని
కొడుకు సరోజనాథుడు భర్తకాగ
సవరించి రామప్రసాదు తనూజ
నవనత పంకేజ నర్ధాంగి జేసె
తన జ్యేష్ఠ సుతునకు, ఘనుడు గోపీకి
తనరారుచున్నారు ధనధాన్య వృద్ధి. 14

దివ్యశీల కమలాదేవి విశిష్ట
భవ్య సుగుణధాము ప్రసీవ్రితసోము
శ్రీరామమూర్తిని చెందె భార్యగను
ప్రారబ్ధవశమున పటుయౌవనమున
మోక్షసామ్రాజ్యంబు పొందెనాతండు
అక్షయంబగు దుఃఖ మర్ధాంగి పొంద
ధీరమ్మ వైజయంతీమాల, చతుర

భారతి సుగుణాలవాల పద్మావ
తి యనంగ నొప్పు పుత్రిక లిర్వురొప్ప
జయత రాజ మిహిరాక్ష ప్రసాదనగ
కొమరుండు వెలయును కూర్మితో పెద్ద
కొమరితన్ మిక్కిలి గోముదైవాళి
ఆల దాశరథి సూరి ఆత్మజాతునకు
లలినగరాయల కలరుచునిచ్చె
వీరలందఱు నేడు పిల్లపాపలను
వారని సుఖముల వరలుచున్నారు. 15

పూర్వజన్మాన నేదివ్య పురుషుడగునో?
వరలు బ్రహ్మర్షి తన తపోభంగమైన
నిట్టి రూపాన నిలయందు పుట్టెనేమొ?
అనుచు నెంచిరి గురుదేవు నరసి ప్రజలు. 16

ఈ మహనీయుతోడ వసియించుచు, నాయన నాశ్రయించుచున్
ప్రేమగ మాటలాడుచు పరీక్షగ చూచుచు, తత్పురాణ గో
ష్ఠీ మహిమంబు లెన్నుచు ప్రసిద్ధపు గాథల వించు నున్నవా
రేమి తపంబుజేసి జనియించిరొ ధన్యత గాంచి రర్మిలిన్. 17

అనుచు నాథ క్తశేఖరు న్నమర వంద్యు
హృద్గత శ్రీరమాధవు సద్గతులకు
మార్గదర్శకు సుగుణి సమ్మాననీయు 18
డైన శ్రీనివాస గురుని నతినుతింత్రు.

# తపస్సిద్ధి

## బృందావనఖండము

ధీనిధియై సదా బుధ విధేయుడునై రఘురామ చింత నా
ధీన మనస్కుడై వరసుధీనుత నిర్మల వర్తన క్రియా
స్థానమునై స్వశిష్య జనతా మమతాయుత సత్కృపా కళా
మానితు శ్రీనివాసపెరుమాళ్ళ గురూత్తమునెంచి మ్రొక్కెదన్. 1

ఓ స్వామీ! భవదీయ నిర్మల పవిత్రోదంతముల్ భావి భూ
మీ సామాన్య జనాళికిం దెలియగా మీ దివ్య చారిత్ర మే
వో సారప్రవిహీన వాక్కుల నిదే పూరించి యందించితిన్,
బాసంజేసెద వాస్తవంబులనె సంభావించి నానంచొగిన్. 2

ఉలుపాలెయ్యవి మీకు నుర్వి ? మన చూతో ద్యానసీమన్ ప్రజా
వళికిన్ నిత్యము దర్శనంబగు విధిన్, త్వద్గాథ లెవ్వేళను
జ్జ్వలమై జాతికి మార్గదర్శకముగా వర్తింప బృందావనం
బలఘు స్ఫూర్తి ఘటింప జేసితిమి ఆర్యా! చూచి దీవింపవే! 3

పావనమైన మీ కథలు పాడుచు భక్తికి పట్టుగొమ్మలై
శ్రీవర పాదపూజన వశీకృతచిత్తులునై విశిష్ట భా
వావధి సాధుసమ్మత మతాధ్యులునై చరియించువారి, బృం
దావన సీమనుండి సతతంబును బ్రోచి తరింపజేయవే! 4

పిల్లలు లేనివారు దురపిల్లు నవస్థను చూడలేము, తా
మెల్లపుడున్ రమారమణునేమరకుండ త్వదీయ బోధనన్
ఫుల్ల మనస్కులై పరమ పూజ్యత బృందకు వచ్చి వేడినన్
పిల్లలు మాకు చాలుననపెల్లుగ నిచ్చి సమాదరింపవే! 5

మీ విపులార్థ బోధనలు మీధ్రువ భక్తియు సంస్మరించి రా
బోవు జనంబు మీ యడుగు పుంతల జాడలు పట్టిపోవమే
మీ విధి భక్తిభావమున నేర్పడజేసిన కట్టడంబు బృం
దావనమందు నిల్వుము—జనంబుల ముంగిట కల్పకంబుగన్. 6

ఏవిధమైన వాంఛ తలమెత్తిన వచ్చిరొయెంచి, వారి తా
యావిధమైన కోరికల నంతము పండగజేయుమయ్య! ఏ
దే విధి చిన్నమెత్తు ఫలియించిన మిన్నునకెత్తుచుంద్రు బృం
దావన మొక్క క్షేత్రమని తర్పరులై యరుదెంచి భక్తితోన్. 7

అది బృందావనసీమ కృష్ణుడిటనే ఆనంద సామ్రాజ్య సం
పద రేయింబవ లాటలాడె ఖళిరా! భక్త వ్రజానీక సం
స్పదమై రేణురవార్ద్రి దివ్యరుచులాచ్ఛాదించె నీయుర్వరన్
కదియన్ రండదె బంధమోక్ష పదవీ కల్యాణ సంసిద్ధికిన్. 8

శ్రీవర దివ్యపాద సరసీజ చరద్భ్రమరంబు, యోగ్య సం
భావుడు శ్రీనివాస పెరుమాళ్ళు గురూత్తముడిందు సత్తపః
పావనశీలుడై నిలిచి భక్తుల ముక్తుల చేయుగాన, బృం
దావన వీధి సంచిత జనావన దక్షుని చూడరండొగిన్. 9

# తపస్సిద్ధి

## కన్నీటి వీడ్కోలు

విదుషీమణి
పద్యాల రామ బాణమ్మ
(స్వామి ప్రథమ సోదరి)

విదుషీమణి
తన్నీరు కమలాదేవి
(స్వామి ద్వితీయ సోదరి)

తండ్రీ! శ్రీనివాసగురూ! బ్రహ్మవిదగ్రేసరా! అజ్ఞానతమః పటల నీరేజబంధూ! కారుణ్యసింధూ! నమోనమః

మహర్షి, తేజోమూర్తులు, సర్వసంరక్షకులు భగవద్రామానుజ తుల్యులగు తండ్రిగారు పరమపదించినపుడు మనోవ్యథ దుర్భర మైనది. కాని తత్తేజము, నాల్గురూపములుగా పుత్రాకృతిని బాల భాస్కర మూర్తులుగా పైకి వచ్చుచున్నట్లుభావించి శిష్యలోకమును, మేమును శాంతిబొందితిమి.

అట్లే మీరును బ్రహ్మోత్సవములు నిర్వహించుటయందు గాని, పురాణ ప్రవచనములందుగాని, శిష్యలోకమును వృద్ధి పొందించుటలోకాని, దేవాలయశోభను ద్విగుణీకరించుటలోగాని, తండ్రిగారిని మరపించితిరి.

మహాత్మా! మీరును మీ సోదరులును, నిద్రాహార వివర్జితులై శ్రమించి, దేశమంతయు పర్యటించి, శ్రమించి రక్తాక్షినామ సంవ

త్సరమున, దర్శించినవారికి పునర్జన్మ లేదనునట్లు, మహావైభవ సంపన్నముగా కోటిహవన లక్ష్మీనారాయణ మహాక్రతువును చేయించితిరి.

ఆహా! ఏమి! మీ జన్మకర్మములు దివ్యములుకదా! మీ నిష్కామ నిష్కళంక, నిస్స్వార్థ నిరుపమాన బ్రహ్మతేజో విశేషములు వర్ణింప సాధ్యమా! యజ్ఞానంతరము శేషధనముతో దేవాలయ ప్రాచీదిశ దివ్యదేశముల తలయింపజేయు మంటప నిర్మాణము కావించితిరి. ఎవ్వరును, అర్థింపకున్నను మేఘములు లోకమున వర్షించి పరోప కారమొనర్చునట్లు ఆ దివ్య మంటపాస్థానమున, ఉదయసాయం సమయముల నాచార్య చరిత్రములను, మహాభాగవతమును మండల దినములు ప్రవచించి భాగవతుల నానందాబ్ధి నోలలాడించితిరి.

మొన్న పురాణమునకు వెళ్ళబోవుచు, అనుజాతలమగు మా యిద్దరిని జూచి, "మీ యిరువురకును విభీషణశరణాగతి చెప్ప వలయునని వాంఛయున్నది. మీరేమందు?"రని ప్రశ్నించితిరి. "అయ్యా! మీయంతట మీరు చెప్పెదమనుచుండ నడ్డుపెట్టునంతటి పాపనిరతలమా? అట్లేచెప్పు"డని అర్థించితిమి. వ్యవధి చాలనందున నాల్గురోజులు మాత్రముసాయించితిరి. ఆహా! ఏమి ఆవాఙ్మాధురి? ఏమి హాస్యరసగర్భిత పరిహాసపుజల్లులు? ఆ దివ్యవాక్కులిక మా వీనుగవకు విందులు నింపవుకదా! మేమును, సోదరులును, మిమ్మే దైవస్వరూపులుగానెంచి ఆరాధించితిమి. ఏనాడును మీకెదురాడి ఎరుంగము.

అరుంధతీ, సావిత్రీ, అనసూయాది పతివ్రతామ తల్లుల కెనయగు పరమసాధ్వి మీ అర్ధాంగి. మిమ్ము ప్రాణాధికముగా

ప్రేమించి గౌరవించి సేవించినది. మీ కుమారులును, కుమార్తెయు, మీ శరీరమునకేమి బాధకలుగునో అను బాధతో ఔషధములు సేవింపుమని మిమ్ము తొందరపెట్టిరి. అది మీ యందు వారికి గల అపార ప్రేమ విశేషమని మీకును తెలియును.

అట్టి మమ్మందఱను వీడి పరమ పదము చేర మీకెట్లు వాంఛ కల్గినది ? సకల విద్యా పారంగతుడును, సభాపూజ్యుండగు జ్యేష్ఠ పుత్రునకును, అనుంగుతనూభవకును అంతిమ దర్శనం బేల అనుగ్రహింపకైతిరి? మాయందు దోషములున్న కరుణాస్వభావులు, క్షమాగుణసంపన్నులగు మీరు, వాటిని క్షమింపవలదా?

జగత్తునకు వెలుగు చూపించు మీకు డెబ్బది వత్సరములు పెద్ద ఆయువు కాదుకదా! ఏమి త్వర వచ్చినదని తనలో ఐక్యమొనర్చుకొమ్మని వేణుగోపాలునకు విన్నవించితిరి? విన్నవించితిరిపో! వాడు కొన్ని గంటలలోనే మీ విన్నపమునంగీకరింపవలయునా? నూట ఎనిమిది దివ్య దేశములందలి, ఏ భగవన్మూర్తిని దర్శించిన మిమ్ము దర్శించిన తృప్తి మాకు కలుగ గలదు?

"కరవై పోయితివాంధ్రదేశమునకున్ కర్ణాటరాజన్య" అని మూడవ అన్నగారు, శ్రీకృష్ణరాయని ప్రశంసించిన పద్యము, మీ రస్తమించినదాది,

"మరుగైపోయితివాంధ్రదేశమునకుం బౌరాణిక శ్రేష్ఠ" అను రూపాంతరముతో మా నాలుకలపై నర్తించుచున్నది. పరమహంస గర్భమున జన్మించితిరి. శాస్త్రములభ్యసించితిరి. భగవద్భక్తి ప్రబోధించితిరి, భగవత్సంబంధగ్రంథములు విరచించితిరి. పరమ పావను

లగు పూర్వాచార్యుల చరిత్రమును సులభశైలిలో మూడు భాగము లుగా నాంధ్ర పాఠక కరకంజములకలంకారముగా నందించితిరి.

కోట్లు ధనమార్జింప వచ్చును. సార్వభౌమాధికారము పొంద వచ్చును. స్వచ్ఛందమైన మీ అంతిమ స్మృతితో ధీమంతులగువారు ఆశ్చర్యపడి స్తుతించునట్టి మీ నిర్వాణము మాత్రమెవరికి ప్రాప్తిం చును. ఉభయ లోకములందును పరిపూర్ణత సాధించిన మీకు కొరత లేదుగాని ప్రతిక్షణము మీరు లేని లోటు మమ్ము తట్టి భయపెట్టు చున్నది. అగ్రజా! మేమెట్లు తట్టుకొనగలము ? మీ ప్రయాణము రోజు అస్తమయము వరకు చెల్లెళ్ళమగు మా దగ్గర కూర్చుండి ఏవియో పూర్వపు సంగతులు, బ్రహ్మోత్సవములు మొదలుపెట్టిన సంగతులు ఇంకనూ అనేక విషయములు మాటలాడిరి. ఏ విషయము చెప్పినను సముద్రజలము మేఘుని గర్భము జేరి తీయనయినట్లు వినసొంపుగానే యుండును. అట్లు మాట్లాడుచు అలసటవచ్చుచున్న దనగా మేము మాట్లాడకండి, మెట్లు దగ్గర కూడా కూర్చోబోకండని ఎన్నడూ లేనిది మిమ్ము శాసించితిమి.

మీ చిత్తమున ఏమి దలంచితిరో గాని మారు మాటాడలేదు. అన్యథాభావింపక మమ్ము క్షమించండి. అటు తరువాత లేచి వెళ్ళి మామూలు సమయమునకు స్నానము, భోజనము గావించి చిన్న కుమారునితో ఏదో ముచ్చటించుచు కొంచెము దడ వచ్చుచున్నది బాబాయిగార్లను పిలచిరమ్మని సర్వవిధసమర్థులగు ఆ తమ్ముని రావించి బాధ్యతలన్నియు అప్పగించినట్టుల ఒక్క మాటతో అయి పోయిందిరా వెళ్ళుచున్నానని అమ్మా అని అటుపై రామ రామయని రామునిలో లీనమైతిరే! మీ రెండులకు అంతిమ స్మరణవాడే మిమ్ము స్మరింపగలడు గాని మీ నోటి వెంట రెండవ శబ్దమెటుల రాగలదు? ఎన్ని పర్యాయములు రామగాథ వాగ్రూపమున మీ నోటి వెంట

ప్రవాహమై వచ్చెనో, ఎన్ని మారులు భారత, భాగవత, భగవద్గీతలు మీ వాక్కు నాశ్రయించి ప్రకాశించెనో ఏమి లెక్క. లోకమున ఎంత మంది పుట్టుటలేదు. గిట్టుటలేదు. ఏమి ఆ చరమవిగ్రహశోభ; ఇంత యీ మహాపురుషుని దర్శన స్పర్శనాదులు దొరకవు గదా అనే దుఃఖము యావన్మందిలోను గోచరించినది. శ్రీనివాస గురూత్తముడను లోక బాంధవుడ స్తమించెనను వార్త దావానలము వలె శిష్య లోకమునకు దాకి వారు సుగ్రీవసైన్యము వలె దిగి గురు చంద్రుని పాదములపైబడి ఘోరుస విలపించుచు, కఠినాత్మా మా గురుదేవుని పొట్టనుబెట్టుకొంటివాయని భగవంతుని నిందించిరి. అయిననూ వారి గురుభక్తికి నిదర్శనము గాని దోషము గాదుగదా.

33 సంవత్సరములనాడు పరమపదించిన పితృదేవుని దర్శనమైనటులుగా ఎంతసేపు జూచినను తనివితీరదాయె. అయిననూ తప్పదు గదా! అనుజులు, కుమారులు, శిష్యకోటి, బంధువులు, అభిమానులు తీర్థ ప్రజవలెమేళతాళములతో, భక్తుల కరతాళధ్వనులతో వెంటరాగా భగవదుత్సవమువలె మీ అంతిమ యాత్ర సాగినది. పాపుల కళేబరములు కాల్చికాల్చి సూర్యాస్తమయ సమయమున మీ పవిత్ర పుణ్య శరీరమును స్పృశించి పావకుడు పావనుడయ్యెనే! ఇట్లు మీ అంతిమ యాత్రయు జారౌదైహిక క్రియలును దుఃఖయుక్తమై, వైభవోపేతమై విశిష్టముగా మహోన్నతమగు యజ్ఞమువలె ముగిసినవి. జన్మ, జీవితము, ప్రాణోత్క్రమణ, ఉత్తర క్రియాకలాపము, బృందావన నిర్మాణము, పరమపదోత్సవము ఇట్లు లోకోన్నతముగా జరిగినవి. నిత్యసూరులలో చేరియున్న మీకు మేమును, భాష్యకార సమాజము వారును ఒక విన్నపము జేయదలంచితిమి. ఏమందురా మా తమ్ములున్నారని త్వరపడి మీరు నిత్యవిభూతిపేం

చేసిరి. దేవాలయ కార్య భారవహనము, శిష్యలోక పరిపాలన, లోక మునకు వెలుగుపదము జూపుట మొదలగు లోకోన్నతమగు పనులు వారి భుజస్కంధములపైనున్నవి గాన మీరును, తండ్రిగారును రామానుజయోగేంద్రులును కలసి మీ ప్రియానుజులకు నూట నూరేండ్లు ఆయురారోగ్యములు గల్గి యీ బాధ్యతలన్నియు దీర్చు చుండునటుల దేవాదిదేవులును, సర్వజ్ఞులును, సర్వలోక శరణ్యు లగు లక్ష్మీనారాయణులకు ప్రపత్తి జేయమనియును, మన కుటుంబ ములన్నియు వారి సొత్తు గనుక వారి చల్లని చూపుతో సర్వదా కటాక్షించుచు రక్షకులై యుండవలసినదిగా పురుషకారము జేయగల రని విన్నవించుచుంటిమి. మహామహితాత్మా! శ్రీనివాస బుధోత్తమా! పూత చరితా! అన్నా యివె మాకత్రైక నమస్సుమాంజలులు.

—0—



తర్కవేదాంత విశారద

**పండిత శ్రీ మొవ్వ శ్రీనివాసపెరుమాళ్ళుగారు**

శ్రీరమా చిత్రశాల